# కా వ్య క ళ



కృతిభర్త
పూజ్యశ్రీ మేకా గన్నయ్యచౌదరిగారు
కూచిపూడి (తెనాలి తాలూకా)



కవిభట్టారక
మొవ్వ దాశరథిసూరి

# కృతజ్ఞత

నేఁటికి నుత్తమ కృతికన్యలు ముగ్గురు వరించి, వారి యనన్యసామాన్య కవితాభిమానమును దిక్షుహారముల గాన మొనర్ప, మధురగుణైకతానులై, తెలుఁగు మాగాణిలో సుప్రథఁగాంచి; ప్రప్రథమమున నా యందలి సారస్వతజ్యోతిని గుర్తించుటయేకాక, వారి పవిత్ర ప్రేమ రసామృత ప్రవాహమున నన్నోలలాడించిన

మా పూజ్యశ్రీ

**మేకా గన్నయచౌదరీంద్రులకు**

జీవితావధి కృతజ్ఞుఁడను.

శ్రద్ధవహించి యథాకాలముగా మా కావ్యమును నయనాభిరామము నొనరించి యిచ్చిన శ్రీ భారతీ ప్రెస్సువారికి మా మెచ్చికోలు వక్కాణములు.

గ్రంథకర్త.

## విభావములు

ఆలంబనోద్దీపన భేదముచే విభావము రెండువిధములు. నాయికా నాయకాదు లాలంబన విభావములు (రససమవాయి కారణములు). నాయకాదుల గుణచేష్టాలంకరణాదులును, మలయానిల చంద్రాదులును నుద్దీపన విభావములు.

## అనుభావములు

భ్రూవిక్షేపకటాక్షాదివికారో హృదయస్థితం భావం వ్యనక్తి యస్సోయ మనుభావ ఇతీరితః. హృదయాంతర్గతమైన భావమును వ్యక్తీకరించు శరీరజన్యములగు భ్రూవిక్షేపణ కటాక్షాది వికారము లనుభావములు.

## సాత్త్వికభావములు

సుఖదుఃఖాదుల ననుభవించుటకైన యంతఃకరణము నానుకూల్యావస్థ సత్త్వము. దానివలన నిష్పన్నములగునవి సాత్త్విక భావములు. పరస్య సుఖదుఃఖాదే రనుభావేనచేతసః అత్యంతే నానుకూల్యేనయేన తద్భావభావనం తత్సత్త్వంతేన నిర్వృత్తా స్సాత్త్వికాఇత్యుదీరితాః-అనుభావత్వ సామాన్యే సత్యప్యేషాం పృథక్తయా లక్షణం సత్త్వజత్వాద్ధి తే చస్తంభాదయ స్స్మృతాః, అని భావప్రకాశాదులయందు నలౌకికమై సామాజిక గతమగు రసమునకు సామగ్రియైన సాత్త్వికమునకు లక్షణము చెప్పఁ బడినది.

## వ్యభిచారి భావములు

రససహకారులైన నిర్వేదాదులు వ్యభిచారి భావములు, సర్వరససాధారణములగుటచే నివి వ్యభిచారులని వ్యవహరింపఁబడు, మజ్జంతశ్చ నిమజ్జంతః కల్లోలాస్తే యథార్ణవే తస్యోత్కర్షం వితన్వంతి యాంతి తద్రూపతామపి, తథాస్థాయిని నిర్మగ్నాహ్యున్నగ్నావ్యభిచారిణః పుష్ణంతి స్థాయినం స్వాంశ్చతద్రయాం తిరసాత్మతాం - విభావానుభావ సాత్త్విక వ్యభిచారాదుల స్వరూప విభాగోదాహరణాది విస్తరము రసార్ణవ, రసరూపణ, రసగంగాధర, శృంగార తిలకాద్యలంకార గ్రంథములయందుఁ జూడనగును.

## కావ్యకళలో

రసమున కొక్క భాగము ఘటింపఁబడిమె. నొక రసమున రసాంతరానుప్రవేశమున్నను నంగిరసమేగదా ప్రధానము. శృంగారమునకు, వాసంతికాభాగము లక్ష్యము. దీనియందు నాయకుఁడు పుష్పసేనుఁడు, నాయిక వాసంతిక, నాయకుఁడు శృగార రసానుకూలుఁడైన ధీర లలితుఁడు. 'నిశ్చింతో ధీరలలితః కలాసక్త స్సుఖై కభూః', రాజ్యభారము తండ్రియైన జయంతసేనునియందే యున్నట్లు "ఆస్థాన తంత్రంబు లధిపుఁ డాలోచింప" నని యుండుటచే నిశ్చింతత్వమున్ను, "అపుడు పుష్పసేనుఁ డలరి మిత్రుని పావురంబుఁ బట్టి" రాజపుత్రులతోఁ బందెము వేయుట మొదలైన వానివలన గళాసక్తత్వమును సూచితములయ్యె. నాయకుఁడు బాల్యమునఁ

"బరువు దోలుట, గుఱ్ఱపుస్వారి పందెముల్ గట్టి పెనంగుటల్ మొనలుగట్టుట" మున్నగు పరిశ్రమచే శారీర సంపత్తియు "కావ్యంబులన్నిటి నాకళించె" నని నాగరికతా మూలంబైన విద్యయుఁ గలిగి, యుత్తమ భారతీయ సాంప్రదాయమునం బెరిగినవాఁడు. పిదప "మిసమిస జవ్వనంబు కందళించెను నరనాథ నందనునకు" నది "ఉక్కు కత్తుల పారాల నొదిగియున్న" మానసమునుగూడఁ గలఁతపఱచును. దానికిఁదోడు "వసంతము వచ్చె నితాంత కాంతమై" "వెన్నెల తీర్చికాసె నుడువీథుల నిర్మల గౌరవర్ణ సంపన్నత" "చిగురు చింతల గుంపు చివర కొమ్మల కెక్కి పంచమస్థాయిలోఁ బాడెఁబికము" పుష్పసేనుని ధైర్యమును బూవుటమ్ములదాడి యస్తు బిస్తుగ నపహరించె నిట్లు రసానుభవ యోగ్యమైన పరికరమంతయు సమకూడినది. కాని నాయకునికింక నా దశ ప్రాప్తించలేదు. మనస్సున కేమియుఁ దోఁచదాయె. మఱియొకరీతిగాఁ జరించుటకు నార్ష సాంప్రదాయముల నడుమ నొత్తిడి నొందిన వాఁడగుటచే సాహసింపలేకపోయె. నిట్టి తఱి నతని, యాదృచ్ఛిక భావనా ప్రపంచమున మిత్రుఁడు స్మృతి రూపముగాఁ దగిలెను. వెంటనే తల్లిదండ్రుల యాజ్ఞఁగొని చెలికాఁడు నివసించునట్టి "పురముఁ జేరుకొనియెను రాజ కుమారకుండు." యువకులతోఁ గూడి సాయంకాలమున నచ్చట సింధునదీ సైకతంబులఁ బావురా పందెములు వేయుట కరిగెను. గోడె ప్రాయంబుననున్న వారి కిట్టివేగదా యుబుసుపోకకైన కృత్యములు. భవితవ్య హేతువై యా కలరవంబు దైవకృతంబునఁ బాఱఁజూపె. దానిగ్రహింపఁ బుష్పసేనుఁడు వెంటనంటె.

శృంగార కావ్యంబున విలాసభాజనములైన శుకపికక లరవాది వృత్తాంతములు రసోపస్కారము లగుటచే నీ పావుర ముల పందెమిటఁ బొందుపఱుపఁబడియె. విహంగము నాయకు నకుఁ జిక్కలేదు. విసివి యతఁడొక్క శిలాతలంబునఁ గూరు చుండెను. "కురవకంబులు చాలు హరివాణమిది నిండఁ జంప కంబులఁ ద్రుంపు శారదాంబ!" యిట్టి "పలుకుల్ దినాంత సమయంబున సాగెడి మందమారుత స్వనములతోడఁ గూడి తనచక్కటికిన్" వినవచ్చినవి. యువతుల కంఠనాదము లని గుర్తించినాఁడు. కపోతచింత వెనుకంజ వేసినది. "ఆరామ స్థలి యిచట రాజరాజాస్యలొగిన్ గోమల పుష్పావచయ వ్యామోహితలై చరింప నగునని" వేడ్కతో వారిఁ జూడఁ గోరి కలరవవ్యాజముఁగొని వెళ్లెను. దోఁటలోనున్న సౌధము నొద్ద కరిగినంతనే "శారిక నికుంచిత కంధరమెత్తి పల్కెనో భారత వీరవర్య! యిదె స్వాగతమంచు" మంచి యువశ్రుతి ధ్వనించినది. రాజకుమారునిఁ జూచి యచట జడ లల్లుకొను చున్న వాసంతికా మణిమాలలు "కాంచీమణి దామముల్ రవళిసేయఁగ"లేచిరి. గంభీర యగుటచే వాసంతిక కన్నుగీటి చెలియలిచేఁ బీఠము వేయించినది. వారి మనోహరాకృతులను గనినంతనే పుష్పసేనుని హృదయమందలి రతిరూప స్థాయి చలించి తరంగముఁగొట్టినది. వారితో మాట్లాడి విషయము నెఱుంగ నూహ జనించెఁ బీఠము వేయించుట వలనను వేయుటచేతను వారిద్దఱిలోఁ దారతమ్యముగ్రహించి మణి మాలతోఁ "జకితహరిణాక్షి! మీర లే జనవరేణ్యు ప్రియ కుమారిక లిద్దఱిపేరులేమి ?" యని లౌకిక పురాణమున కుపక్ర

మించినాఁడు. వీణాకలకలనినదంబుల నేవగించు నిర్భరఫణితితో నామె స్వవృత్తాంతము వివరించి, పుష్పసేనుని కథ నడుగవచ్చి కులకన్యాస్వభావంబునకు లోపంబుగలుగునేమోయని విరమించినది. అది యెఱిఁగి నృపసూనుఁడు తనగాథ నామూలాగ్రముగాఁజెప్పెఁదోడనే "వేణిక్రొన్ననలు ధరిత్రిరాల వదనంబున నిద్దపు సిగ్గుదొంతరల్ దొనికిసలాడ" వాసంతిక లోనికేగినది. యిట వ్రీడాఖ్య వ్యభిచారి భావము — చేతస్సంకోచనంవ్రీడా, అంతర్ధాన వైవర్ణ్యాదులు దీని కనుభావములు. అక్కా యిల్లేగుట తగునాయని మణిమాల నవ్వినది. వారి చేష్టా భాషణంబులలోని తాత్పర్యము పుష్పసేనునికి గోచరింపలేదు. పెక్కువిధముల నాలోచించినాఁడు. వాసంతిక లోనికేగ హేతువేమి? పరపురుషుఁడనియా? అంతదనుక స్వీయుఁడని తలంచెనా? రాజకుమారుఁడని తెలిసికొనుటవలననా? చెప్పక చెప్ప రాజచిహ్నంబులఁ జూచియేగదా పీఠమువైచి గౌరవించినది. లోనఁ బనియుండుటచేతనా? అట్లైనఁ దనపేరు సెప్పఁగనే పోవనేల? పోవునప్పుడు క్రొన్ననలు రాలుట సిగ్గు దొంతరలు మొగంబున మూగుట మొదలగు విలాసము లేల వచ్చెను? రాజసుతుని యాలోచనమిదియే. అట్టి పోకకుఁ గొంత మూలగాథ యుండును. నవివాహితమైన వధువు నిశ్చిత వరునిఁజూచి చేయు శృంగారచేష్ట యిది; వాసంతిక యిట్లొనర్చుటకు సింధురాజు పుష్పసేనునకుఁ దన నీయవలయునని తలంచియుండుటయే హేతువు. నాయకునకు సింధురాజ తలంపు తెలియని కారణమున వారి భావము స్ఫురింపలేదు. పుష్పసేనుఁ డెఱుఁగఁడని వాసంతికకుఁ దెలియని కతమున

లోనికరిగెను. దీనివలన నాయికయందున్న స్థాయిభావము సూచితమైనది. పుష్పసేనుఁడు లజ్జ మొదలైన వ్యభిచారుల వలనను గటాక్షవిలాసాద్యనుభావములచేతను సాకూతమైన మణిమాలా హాసమువలనను నామెయందున్న రతినిఁ బసిపట్టి నాఁడు. తనువు పులకరించెను. దాని నెదుటివారు సూచిన గాంభీర్యమునకుఁ గొంత, యందువలన నేమియు నెఱుఁగని వానివలెఁ గప్పిపుచ్చుటకై తానువచ్చిన హేతువు నుపన్యసింప మొదలిడి పై శృంగారక్రియలచే వారియందు నించుక చనవుగలిగి లోని స్థాయి కల్లోలమువలన "భావజరాజ్యలక్ష్మి" యని మణిమాలను సంబోధించినాఁడు. ఇచ్చట నవహిత్థయను వ్యభిచారి భావము — హర్షాద్యాకార సంగుప్తి రవహిత్థేతి కథ్యతే. దీనికి శూన్యస్మితాన్యథా కథన మిథ్యాధైర్యకథా భంగాదు లనుభావములు. మణిమాల లోనికేగి వాసంతికను బరిహాసము పట్టించినది ఏమని? మగఁడువచ్చి వాకిటనిలువఁగా లోన డాఁగితివేమి మగని పావురముఁ బట్టించితివి. నీవే యిచ్చుకొమ్ము. నీ తప్పును నీవేదిద్దుకొనుము. తెమ్మనుచున్నాఁడు రావేమి? యిల్లే. కపోతమును వెలికిఁ గొనివచ్చి మీ దిదియేనా యని యడిగినది మణిమాల. అవు నదియే. అల్లయిన "ముచ్చటఁజెంది మా చెలియ మోహముతోఁ గయికొన్న దీని నేఁడిచ్చట" నుంచుడని యామె తమకతనితో నింక సంబంధముండునట్లుగాఁ గోరినది. "కన్యారత్నముమీఁద నుంపఁదగు మీ కారుణ్య మీ మాత్రమో ధన్యాత్మా! యని ప్రార్థించినది. ఇప్పుడు వాసంతిక యనురాగము కొంత స్ఫుటముగాఁ గనిపించినది. సంతోషించి యొప్పుకొని "దీనికై

యన్యున్ వేఁడినయట్లు వేఁడఁదగునే" యని వారిలో నంతర్భ
వించి నాయకుఁడు తన యనురక్తిని వెలార్చినాఁడు. వారి
వేషవచన సరణి మెచ్చుకొనినాఁ డింతలో వాసంతికా మణి
మాలలను గృహమునకు రమ్మని చేటి పిలిచినది. పోవకతప్పదు.

కాంతపదాంగదంబులు చొకాటముగా రొదసేయుచుండ వా
సంతిక చంద్రకాంతమయ సౌధము వెల్వడి రాజపుత్రు పీ
ఠాంతికమందు నొక్క సుమహారముఁ గానుకవెట్టె శర్వరీ
కాంతసమానమౌ నగుమొగంబును గొంచెమువాంచి సిగ్గునన్.

ఇచ్చట లలిత విలాసములను శృంగార చేష్టలు వ్యక్తములయ్యెను — సుకుమారాంగ విన్యాసోలలితం పరికీర్త్యతే తాత్కాలికో వికారస్స్యాద్విలాసో దయితేక్షణే. వ్రీడాఖ్య వ్యభిచారి భావము, ముఖానమనరూపానుభావము, స్ఫుటములు. కానుక వెట్టుటచే నాయికయనురాగస్థాయి ప్రస్పష్టమైనది. పరుఁ డెవఁడో కనఁబడిన మాత్రముననే యభిజాతమైన రాజకన్య త్వరపడి యిట్లు పుష్పదామము నిచ్చుట యుచితమా ? అదియు వట్టిదిగాదు, మదనసందేశముతోఁ గూడినదే ! యను శంకయవసరములేదు. తండ్రి పుష్పసేనునకుఁ దననిచ్చుటకు సిద్ధపడియున్నాఁడు. కాకతాళీయముగా నతఁడు తామున్నచోటికి వచ్చెను. రూపవిలాససంపన్నుఁడు, వాగ్మి యువకుఁడు నైన యతని ప్రథమదర్శనముననే యనురాగము వాసంతికకు స్థిరపడినది. ఏమియు చేయక మూతి ముడుచుకొని కూర్చుండినఁ దనయందు నతనికిఁ బ్రేమపొడమునా? వైదుష్య రాగములు వెలువడునా ? గాన మణిమాలతో నాలోచించి

యీ పనిచేసినది నాయిక. పిత్రభిమతనిశ్చితుఁడైన వరునియందు ననురాగము ప్రకటించుట దోషమా?

తనముందుఁ బుష్పహారము వెట్టునప్పు డామె "శరీర భాగ మాద్యంతము బాఱఁజూచి" పుష్పసేనుఁడు కుసుమోప హారము వెట్టుట వలనను నామె రూపలావణ్య దర్శనమునను గొంతసేపు "సకలేంద్రియ చర్యలు దక్కి, మ్రాన్పడెన్" "ఇట ప్రళయస్సుఖదుఃఖాద్యైర్గాఢ మింద్రియమూర్ఛ న"మ్మనిప్రళయ మను సాత్త్వికభావము దృష్టమైనది. "ఆ నిడువాలుఁ గన్నులు తిలాకృతినొప్పు తదీయ నాస"యను వర్ణనచే నుద్దీపన విభావ ము న్మర్యాద మైనది. వాసంతిక చేసిన పనిని "మీ కపోతమును బట్టించిన దోషనిష్కృతికై సమర్పించినది" యని మణిమాల చమత్కరించినది. నాయికామణిమాలలిద్దఱు కదలి వెళ్లి నారు. నాయికా నాయకుల కింతవఱకుఁ జక్షుఃప్రీతియను మన్మథావస్థ. ఇఁక శృంగారము కుసుమితమై ఫలితముకావలెను. వియోగముచేఁగాని పరిణతముకాదు. ప్రొద్దుగ్రుంకినది రాత్రి వాసంతికాదులు గౌరీపూజకు వెళ్లిరి. రాజపుత్రి "నీ చరణా బ్జంబుల భక్తి మాకొసఁగవే"యని మ్రొక్కినది. స్త్రీస్వభావ సిద్ధముగా మణిమాల యిది నీ కోర్కిగాదు? పుష్పసేనుఁడు మగఁడు గావలయుననియే నిజమైనవాంఛ, యది నేను విన్న వింతునని దేవికి బరిహాసముగా మ్రొక్కినది. దీనితో మిగిలిన వారందఱు పుష్పసేన వాసంతికానురాగ విషయముఁ గలఁ బలుకుకొని యానందపడి నవ్వినారు. రాజపుత్రి సిగ్గుపడి మోమువాంచినది. ఇట లజ్జాభావోదయము సూచితము. వీర

లెంత యుత్సాహ పడినను నస్వతంత్రులు నాకు మఱుఁగు పిండెలు, బయటికి రాదు. కాన రాజ్ఞిప్రవేశము చేయింపఁ బడి నది. రాణి మణిమాలమాట విని నిలువదీసి యడిగినది. వృత్తాంతమంతయు విని యా రాత్రి రాజుతోఁ జెప్పి తెల్లవాటి మంత్రినిఁ బుష్పసేనునొద్దకుఁ బంపునట్లొనర్చినది.

ఇఁక నిచట రాకొమరుఁడు; వాసంతికాదు లరిగినపిదప "తదంగ నాలోచన మగ్నుఁడయ్యె నెటులో కదలెన్ బ్రియ మిత్రు నింటికిన్," దీనిచేఁ జింత యను వ్యభిచారి భావమును మనస్సంగమను మన్మథావస్థయు గనఁబడినవి – మనస్సంగః ప్రియతమే నిత్యం చిత్తస్య విశ్రమః. మిత్రుం డెదుర్కొని యింటికిఁ దీసికొని వెళ్లినాఁడు, భోజనము సేసిరి. పుష్పసేను నకు నాయిక యందలి యనురాగ భరమువలన "విమల రస భోజ్యములు ఘోర విషములయ్యె". ఇట నరతియను ననంగ దశ, అన్యత్రాప్రీతిరరతిః. రసానుకూలములైన చంద్రచంద్రికా వర్ణనములు సేయఁబడినవి. అవకాశముఁ గల్పించుకొని శృంగార నాయికలు వర్ణింపఁబడినారు.

నిద్దుర గూరియున్న మగనింగని చందన ధూళిమేనిపై
నద్ది సితప్రసూనముల నొఁదల దాలిచి ధౌతవస్త్రయై
ముద్దియ యెవ్వతో విటుని మోసలకున్ జనుచుండెగాని పే
రెద్దియొ నిశ్చయించి వచియింపఁగరాదు లయించె వెన్నెలన్.

జ్యోత్స్నాభిసారిక. దీని ప్రసాధనమంతయు ధవళ మయమే. స్మరార్తా భిసరేత్కాంతం సారమే ద్వాభిసారికా.

ఆ నడురేయివేళ నగరాంతరమందలి పుష్పవాటిలో
సూనశరాసన ప్రతిమ సుందరుఁ డొక్కఁడు చూతపోత సం
తానము నీడలం దొదిగి తక్కుచుఁ దారుచు వచ్చిదూరె ని
మ్మైన లతానికుంజమున నచ్చట నెవ్వరు వేచియుండిరో.

ఇమ్మైన లతా నికుంజమున, నచ్చట నెవ్వరు వేచి యుండిరో యనుటచే వాసకసజ్జిక సూచితమైనది.

ఇందు శిలానిబద్ధమయి యింపగు సౌధముమీఁద జేరి యిం
దిందిరవేణి నొక్క యువతిన్ బలురీతుల వేఁడుచుండె సం
క్రందనసూను సన్నిభుఁ డొకానొక ప్రాయపు వన్నెలాఁడిఁకన్
జందనగంధి నెమ్మనము శాంతి వహించెనో లేదో నాటికిన్.

ఖండితానాయిక స్ఫురించినది- అన్యాసంభోగచిహ్నైస్తు కుపితా ఖండితామతా.

మానినియోర్తు తెల్లని సుమాళపుఁ బైఁట ముసుంగువైచి దీ
నాననయై తటాకతటమందలి పూఁ బొదరిండ్లలోఁ దృణం
బైనఁ జలించి నంత నడియాసదెసల్ పరికించుచుండె నా
మీన మనోహరాక్షి నటు మేల్పడి యెవ్వఁడు మోసగించెనో.

విప్రలబ్ధ- క్వచిత్సంకేత మావేద్య దయితేనాథ వంచితా. అని దీని లక్షణము.

చంద్రికా రూపోద్దీపనవిభావముచేఁ బుష్పసేనునికి వాసంతిక యందలి విరాళి యున్మస్తకమైనది "పండు వెన్నెల తోడ నిండిన వినువీథిఁ బరికించి తేపతేపకును బొరలు......

నిద్దురారాదు, కంటికిఁ బ్రొద్దుపోదు, కాంక్షితంబైన వస్తువు కానఁబడదు, కటకటా మీనకేతన గాఢవహ్ని తప్తుఁడై పెక్కు రీతులఁ దటమటించె" ఇట, నిర్వేద, చింతా చాప లౌత్సుక్య ములను వ్యభిచారి భావములు ధ్వనించినవి. నిద్దురారాదు– జాగరమను ననంగ దశ తప్తుఁడై పెక్కురీతులఁ దటమటించె– తాపాధిక్యం జ్వరోమతః అను సంజ్వరావస్థయు, నిట్టూర్పు, పొరలుట మున్నగుననుభావములు గనఁబడినవి. "నాలుగు జాములు గలిగిన కాలంబొక బ్రహ్మయుగము కైవడి" గడపి నాఁడు నాయకుఁడు. మధురాలాపుఁడు వీనిబాధ గమనించి తెలిసికొన నడిగినాఁడు. చెప్పడేమో యని సందేహించి చింతానుమాపకములైన కార్యముల నుపన్యసించినాఁడు. "నిద్దపు జెక్కులన్ నయననీరము గీరలు గట్టె" అశ్రువను సాత్త్వికభావము. "కన్దొరల్ నిద్దురలేక యుబ్బినవి." వీనికిఁ గారణమై "ఏదియో పెద్ద కలంత నీ హృదయ పీఠిఁ దగు ల్కొనె" "నిక్కముఁజెప్పు మేను క్రొంగ్రొత్తనుగాను" అనిస్వ స్వీయత్వము స్మృతికిందెచ్చి నొక్కి యడిగినాడు. పుష్పసేను నునికిఁ జెప్పక తప్పలేదు. సర్వముచెప్పి, సిగ్గువదలి.

చాటింకేటికిఁ దెల్పెదన్ బ్రియవయస్యా! సింధురాజేంద్రురా
వీటంబుట్టిన కల్పవల్లి తొడిమన్ విప్పారు పొందమ్మి నా
నాటన్ నిగ్గులుదేరు చంద్రకళ యానాళీక పత్రాక్షి నా
పాటీర ప్రతిలిప్తదేహ ననుఁ గూర్పంజూడు మేలా నుడుల్.

అని పల్కినాడు. లజ్జా త్యాగ ప్రలాపములను మన్మ థావస్థ లుద్ద్యోతితములైనవి. ననుఁ గూర్పంజూడు మేలా

నుడుల్ అనుటచే నిర్వేద వ్యభిచారి భావ మావృత్తమైనది. మధురాలాపుడు వాసంతికా భావమరయుటకు వెళ్లినాడు. ప్రియావిరహ మిత్ర వియోగములచేఁ బుష్పసేనునికి గాలము పోలేదు. గోడయందుఁ దగిలించియున్న చిత్రపటములఁ జూడ సాగినాడు. శృంగారాస్పదములైన యా రతీమన్మథ శకుంతలా విరహాది విషయములు విరహజ్వాలను మఱింత రెచ్చగొట్టినవి. సహింపలేక, "తాపభరమున మేనెల్లఁ దటమటింపఁ గన్నుగవమోడ్చి మానసంగతిఁ బరుండె." ఇట మూర్ఛ యను ననంగదశ, స్త్రీ పురుషులందు, "కామోష్టగుణ ఉచ్యతే" అని స్త్రీకే యధికముగాఁ జెప్పఁబడినను, ముందు బయలువడుట పురుషునకు సహజ మగుటచేఁ బుష్పసేనుని విరహము వర్ణింపఁ బడినది. వాసంతికా విరహమల్పముగా సఖీముఖముచేఁ దెలుపబడినది. మధురాలాపుఁ డరుగునప్పటికి – నుపవనమున మణి మాలాదులు, పుష్పసేనుని విషయమే ద్రవ్వుచుండిరి. దీనిచే నాయికకు నాయకునందుఁగల గాఢానురక్తి స్ఫుటమైనది. ఏమియు నెఱుఁగని వానివలెఁ బావురము నిమ్మనినాఁడు మధురాలాపుఁడు. చతురమైన చెలికత్తె "హృదయ మొకటి బిఱుసుపాకం బటంచు భావింతుమయ్య" అని పుష్పసేనుని మనఃకార్కశ్యమును దూఱి "మరుని సూయాణములకుఁ గ్రాగిపోయెడు నలివేణి గదియ కెవఁడు, క్షితి నుపేక్షింపఁ గలఁడో వచింపు" మని వాసంతికా విరహవేదనను సూచించినది. గ్రహించి మినుమిక్కిలిగానున్న పుష్పసేనుని తాపమును వెలిబెట్టినాడు మధురాలాపుఁడు. పరస్పర వృత్తాంతము లిద్దఱికి నెఱుకపడినవి. యానుకూల్యము గల్గినది. "కన్నియ

నిన్న రాకొమరుఁ గాంచినదాదిగ నన్నమేమియున్ దిన్న తెలంగుకన్నడదు, నిద్దురవోవదు మాటలాడదే మెన్నివిధాలఁ జెప్పిన నరేయన"దని వాసంతికా విరహజ్వరమును స్పష్ట ముగాఁ జెప్పివేసినది. అన్నమేమియున్ గుడువదు. అరతియను నవస్థ. నిద్దురవోవదు, జాగరమను మదనదశ. మీ రాజ పుత్రితో నొక సందేశము మా హితునకు జెప్పింపు మని యర్థించినాడు. సందేశము నిన్ననేవచ్చినది, మా వాసంతిక నిన్న మీ చెలువునకిచ్చిన పుష్పహారములోనున్నదని ప్రత్యు త్తర మిచ్చినది చేటి. తిరిగివచ్చి వృత్తాంతమంతయుఁ జెప్పి మధురాలాపుడు సఖు నానందపరచినాడు. సింధురాజు మంత్రి పుష్పసేనునితోఁ గలిసికొని మగధదేశమున కరిగి జయంత సేనునితోఁ దమ రాజుగారి వేఁడికోలు విన్నవింప నతఁడు సంతోషించి లగ్ననిశ్చయమునేసి పంపినాఁడు.

రాజధానుల రెంటి నలంకరించి యధాశాస్త్రముగాఁ బుష్పసేన వాసంతికలకు వివాహమొనరించిరి. పరిణయానంతర మున వసంతోత్సవమునందు, భోజనసమయమున రసపుష్టికై యువతీ యువకుల మదనచేష్టలు కొంచెము పైస్థాయిలోనే వర్ణింపఁబడినవి. రాత్రి వాసంతికను మగనితోఁ జేర్చుటకు మదవతులు తీసికొనిపోయినారు. పుష్పసేనునిఁజూచి యటఁ "కన్య బిడాన భీతయై" "ఎందఱులాగినన్ విడువకే గదిగుమ్మము కమ్మిఁబట్టి మేనం దడిచెమ్మటల్ వొడమ నక్కి మొగంబునఁ బైఁటఁగప్పి" నిలిచినది. ఇట స్వేదమను సాత్త్వికభావము భీతి వ్రీడ యను వ్యభిచారి భావములు. చాటున నొదుగుట

మొగమునఁ బైఁటగప్పుట యను ననుభావములు గనఁబడినవి. నాయికకు ముగ్ధాత్వము తేలినది. మెల్లగా నొక్కొక్క వ్యాజమునఁ బడఁతు లందఱు దొలంగినారు. తలుపు బిగిసినది, పతి బలాత్కారమున లోనికేగి మణిమయరాజ హంసమును బట్టుకొని కాలిప్రేలితో నేలరాయుచు నిలిచినది. వరుఁడు వాసంతిక చనవుగలిగి తన కభిముఖియగుటకై శృంగారచేష్ట లొనరింపఁ బ్రారంభించినాఁడు, వేణి విప్పినాఁడు, కాంచినూపి మొరయించినాఁడు, పయ్యెదలాగినాఁడు; పాపటఁ జిక్కు నేసె, విడెముపై నుమిసె, గిలిగింతలువెట్టె, లాభములేదు. వలదని వారింపలేదు, పలుకలేదు, కదలలేదు. "భర్త హస్తంబు తన పృష్ఠభాగమందు నేమిసేసిన వారింప దింతయైన, ముందువైపున మాత్రము మోపనీదు, తరుణి యచ్చోట నేమేమి దాఁచుకొనెనో" స్థాయిభావము తిరోహితము కాఁగూడదు, స్ఫురించుచునేయుండవలెను. భర్త వెనుక నేమిచేసినను గాదనకపోవుటచే ననురక్తి వ్యంజితమగుచునేయున్నది. కాని భర్తకు లోపడకుండుట ముగ్ధాత్వమువలన. "లజ్జావిజిత మన్మథా" అనిగదా రూపము ముగ్ధకు.

పుష్పసేనుఁ డామెయందలి మదనరేఖను రేకెత్తింపఁ జూచినాఁడు. "వనజాక్షీ ననుఁజూడకున్న సరిపో వాతాయనంబూని మెల్లన వీక్షింపుము బైటకు," నని మందానిల చంద్రికాదులఁ జూపించినాఁడు. "నిన్నేమియుఁ జేయను, నీ చెక్కుల యందున్న చెమటఁ దుడిచెదను. నీ రత్నహారముల చిక్కులు దీసెద నింతమాత్రమే యంగీకరింపు" మని మెత్తగాఁజెప్పి

యొప్పుకొనె నేమోయని "పువుఁబోఁడి యంసమున హస్తము మోపెను" తీసిపాఱవైచి శరీరమేమియుఁ గనంబడకుండ గట్టిగాఁ జీరకొంగుతోఁ గప్పుకొన్నది. అనుకూల్యములేక పోగా మఱింత బిగిసినది. పుష్పసేనునకుఁ దనయం దామెకుఁగల యనురాగ విషయమున శంకగలిగినది. తేల్చుకోఁదలఁచి "మగువా నిన్ననుఁగొన్న నాఁడు మొదలామారుండు కారింపఁగా సగమైపోతి నిదే కనుంగొను" మనినాఁడు. కార్శ్యమనుననంగ దశ యిచ్చట గోచరించినది. "ననుం గరుణింపంగదె" యని వేఁడుకొనినాఁడు. "ఈ చందమునం గలంచుటకు స్వాంత మదెట్లు సహించె"నని దైన్యముఁజూపుకొనినాఁడు. ప్రయత్నము ఫలింపలేదు. తమకము కట్టలఁ దెగఁగొట్టుకొని ప్రవహించినది. "మగువ నీ హరిణాంక మండలంబునఁ జిమ్ము నమృత రసాయనం బాననిమ్ము............ మన్మధదేవునందు లీనమగునట్లు యోగంబుఁ బూననిమ్ము" అని యప్రయత్నముగా వాక్కులు వెడలిపోయినవి. కాని ఫలమునకుఁ బ్రాగభావమే. ఇఁకనిట్లు కాదనుకొని యొక మాయావాగురను బన్నినాఁడు. దానిలోఁ బడిపోయినది లేఁడి; విదుషియైన వాసంతికకుఁ బడక తప్పదు. పతికరములు చెక్కులయందున్నవి. తీసివేయఁ బ్రయత్నించినది. అటవదలి యింకొక మెట్టుదిగినవి. అచ్చట నడ్డుపెట్టఁ జూచు చుండఁగనే క్రమముగాఁ జాలసోపానములు దిగిపోయినవి. అయిపోయినది. తా నింతసేపానర్చిన శ్రమము నిరర్థకమైనది. తన నగ్నస్వరూపము మణికాంతులలోఁ గనుపట్టుచున్నది. మగని కన్నులమూయ నుంకించినది. మూయలేక తనకన్నులనే మూసికొన్నది వాసంతిక. రసప్రధానమైన బాహ్య సంభోగము

వర్ణింపఁబడినది, యాంతర సంభోగము ధ్వనించినది. పైన మన కవసరములేదు.

సంగ్రహముగా రససమన్వయము చేసితి నితరరసములకు నిట్లే యభిజ్ఞు లూహించుకొందురుగాత! నేనీ చర్చ స్వోన్నతి ప్రకటించుటకుఁ జేయలేదు. ఘట్టఘట్టమున రసమును గూడఁ బేర్కొంటిని. దాన, నే నేతద్రసమును బోషింపఁ బోవుచున్నాడనని ప్రతిజ్ఞచేసినట్లైనది. అందువలన నించుక లక్షణ సమన్వయము చేయవలసివచ్చినది. చేసిన తప్పు సవరించుకొనఁ బ్రయత్నించితి నింతమాత్రమే. యభియుక్తులు క్షమింతురుగాక. నేను దీనియందు రసౌచిత్యాదులకు నొనర్చిన శ్రమకు విజ్ఞులే సాక్షీభూతులు.

గ్రంథకర్త.



| | | |
|---|---|---|
| నందన | కృతికర్త | పూడివాడ |
| వసంతము | కవిభట్టారక మొవ్వ దాశరథిసూరి | రేపల్లె తాలూకా |

# అంతశ్శాఖలు

శ్రీః

శ్రీ వేంకటపరబ్రహ్మణే నమః

# కావ్యకళ

## దైవార్చన

చలిమిరివెన్నెలల్ వెలయఁగా రేలందుఁ
జంద్రముండై సస్యసమితిఁ బ్రోచి
మూఁడు వేదంబుల ముయ్యేలగుట్టమై
జగదంధకారంబు సంహరించి
బడబానలముఁ జిమ్ము పడమటిగాడుపై
మడువుల నీరెల్ల సుడిసిలాగి
తొగరుకాటుకవన్నె తొలకరి మేఘమై
భూతధాత్రికిఁ బంటపురుడువోసి

బహుళతరమైన కాలరూపంబుతోడ
విశ్వములనెల్ల నొకపరి వెడలఁగ్రాసి
మఱల లోనికిమ్రింగుచు మాయసూపు
*నాదినారాయణుని నెప్పు డభినుతింతు.

కంటకోదీర్ణదుర్గమస్ఖలితమైన
కుసుమ సుకుమార నుపనిష త్కోమలాంగి
నొడిదొడుకులేని మార్గాన నడపి ప్రోచి
నట్టి యతిరాజచంద్రు నే నాత్మఁదలఁతు.

---

*నాదిదేవుని మదిలోన నభినుతింతు.

## వాఙ్మయసేవ

పుచ్చిపోవదు నేడు పోయి కన్గొన్న మా
నన్నపార్యునిచేతి నాటుకలము
వినుపించు నల్లదె వీనులవిందుగా
సోమయాజులవారి సూక్తిరవళి
సమసిపోలేదు పో సకలసీమలలోనఁ
గవిసార్వభౌముని కాలిముద్ర
తుంగభద్రానది చెంగట శిథిలమై
కన్పించుఁ బెద్దన్నగారిమేడ

ముదిమిభారంబు దాల్ప దే మూలనైన
ముక్కుతిమ్మన్న ప్రాయంపు ముద్దుపలుకు
ముగ్ధ కవితాకళాజ్యోతి మొలక లెప్పు
డంధ్రలోకంబులోనఁ జల్లారిపోవు.

---

## మాతృభూమి

కాత్యాయనీ దేవిఁ గన్న పర్వతరాజు
రత్నాలమకుట మో రమణి! నీకు
రామపాద రజోవిరాజితంబగు సేతు
వపరంజి పీఠ మో యంబ! నీకుఁ
బూర్వ పశ్చిమ దిశాంభోధి సైకతభూము
లసివాఱు బయళు లో యతివ! నీకు

సింధు గంగానదీ బంధుర శాఖలు
బాహునాళంబులో పడతి! నీకు
కలికి! నీ కుక్షి మొలక బంగారమమ్మ!
సుదతి! నీ సూను లసహాయ శూరులమ్మ;
పాఁడి పంటలు గలిగిన పచ్చికాఁపు
రంబు నీదమ్మ భారత రాజ్యలక్ష్మి!

మందాకినీ మందమారుతంబులు పైనఁ
బ్రసరింపఁగా శుద్ధిఁ బడసినావు
కర్ణ మాంధాత్రాది కరదాన వారిలోఁ
ద్రిషవణస్నానముల్ దీర్చినావు
వీరసింహంబుల వేఁడిరక్తములతో
నరుణ సాంద్రచ్ఛాయ దొరసినావు
మునికుమారుల హోమపుణ్యధూమములచే
నిలువెల్ల వాసనఁ గొలిపినావు

జయము జయమమ్మ నీకు ముజ్జగములోన
సకల విషయంబులందునఁ జలువగలిగి
యాఱితేరిన మంచి ముత్తైదువమ్మ
నిరుపమానంద సముపేత! భరతమాత!

ముగురు మూర్తులఁ జిన్న ముద్దుబిడ్డలఁ జేసి
జోలపాడిన దొక్క జోటిమిన్న
కానలోనఁ గిరాతుఁ గంటి మంటలచేత
నీఱొనర్చిన దొక్క నీరజాక్షి

దండహస్తునితోడ దడ్డవాదములాడి
మగని నిల్పిన దొక్క చిగురుబోఁడి
యుగ్రభానునిసైత ముదయంబు గాకుండ
నానవెట్టిన దొక్క హంసగమన

కలికి వీరెల్ల భవదీయ గర్భమందుఁ
గరడుగట్టిన యాచారకాండలోనఁ
దీరుపై వన్నె కెక్కిన వారలమ్మ
చారుచరితావలంబ శ్రీ భారతాంబ !

సత్యానికై రాజ్యసతుల వీడ్కొనిపోయి
కాడుఁగాచెను మన్నె ఱేఁ డొకండు
జనకు నానతి భోగ సర్వస్వములఁ బాసి
వనిఁ జరించెను జక్రవర్తి యొకఁడు
గువ్వకై తన మేని క్రొవ్వుకండలు సెండి
యాహారమిచ్చె ధర్మాత్ముఁ డొకఁడు
జిష్ణునంతటివాఁడు చేఁజాఁప నొడలొల్చి
చర్మం బొసంగె రాజన్యుఁ డొకఁడు

గరిమగల యిట్టి మేదినీ వరులు నీకుఁ
బేరుఁ దెచ్చిన పెద్దకుమారులమ్మ !
యాదిగర్భేశ్వరివిగావె యతివ! నీవు
భాగ్యలక్ష్మీ సమేత శ్రీ భరతమాత !

తల్లిరో నీదు సుగుణముల్ వెల్లడించు
ననుఁగు బిడ్డఁడగాని నీ యందు లేని

పోని దోషంబులను మోపి బ్రువ్వదిట్టు
మాతృఘాతినిగాను సుమ్మా తలంప.

అమ్మా! భారత రాజ్యలక్ష్మి! దయతో నాత్మీయులన్ బ్రోవగా
రమ్మా! శత్రుల కందకుండఁ బాలుపారంగాఁ జిరస్థాయివై
పొమ్మా! మ్రొక్కెదఁ జేతులెత్తి యిదిగోఁ బూర్ణాను రాగంబులోఁ
గొమ్మా! నాకయి మోడ్పు నీకెపుడెసంగున్ గాత కళ్యాణముల్.

---

## ఉద్బోధనము

అభిమానాంధ్రకుమార! మేల్కొనుము నిద్రాసక్తి యింకేల దు
ర్విభు సాంగత్య తమఃపటంబు దిగజాఱెన్ వెల్గె స్వాతంత్ర్య రూ
ప భగోళేంద్రుని దివ్యదీధితికలాపంబుల్ దిగంతంబులన్
ఋభులోకం బెద మెచ్చుకోవలయు నీ కృత్యంబు సాగింపరా.

తెలుపుం జాతికిఁ జిక్కి నేఁటివఱకున్ దీనాతిదీనుండవై
కలఁగంబాఱితి దాస్యజీవన పరాగచ్ఛన్న నేత్రంబులన్
దొలఁగెన్ బీడ; విలంబమేమిటికిఁ గన్నుల్ విప్పరా తోఁచు భూ
వలయంబందున నిప్డు శాంతిలహరీస్వైర ప్రచారోన్నతుల్.

అదిగో బొబ్బిలి వీరసింహముల గర్జారావమాలింపు మ
ల్లదె పల్నాటిమహాగ్రసైన్యభటశౌర్యజ్యోతి యీరెంటికిన్
మొదటన్ బాహువులెత్తి మ్రొక్కి జయమున్ బూరింపరా మడ్డివై
నిదురల్ వోయిన నచ్చపుం దెలుఁగు వన్నెల్ నీకుఁ జేకూరునా.

మలఁగిపోనున్న శౌర్యాగ్నికళిక రేఁపు
తొలఁగిపోనున్న సత్కీర్తి నిలువరించు
కడిఁది మగవాఁడవై కాలఁ గజ్జెఁగట్టు
వెలుఁగునపు డొక్క పెట్టునఁ దెలుఁగుబెట్టు.

చివికిపోయిన పూర్వ శిల్పశాస్త్రాలకు
బట్టు గింటెముతోడ నట్టగట్టు
నవసి పాతరలాడు కవితాధిదేవత
కతుల కర్పూర హారతులఁ బట్టు
మూలవైవఁగఁ ద్రుప్పు మునుకలోఁ బడియున్న
బంగారుకత్తికిఁ బదును వెట్టు
సౌభాగ్యసంపద సమకూరనీయని
శత్రుకోటులనెల్లఁ జావఁగొట్టు

భోరుభోరున నీ జయభేరి వేసి
ధైర్య సాహస కీర్తి ప్రతాపములను
సకల హరిదంతరంబులఁ జాటరోరి
తెగువ గావించి మేటివై తెలుఁగుబిడ్డ.

ఐకమత్యంబె మంగళ శ్రీకరంబు
భావి భాగ్యోదయమునకు జీవగఱ్ఱ
దానిఁ జేపట్ట గలిగితివేని నీదు
మూడుకోటులు ముప్పదిమూడు కోట్లు.

వినయంబున్ గురుభక్తి దైవమునెడన్ విశ్వాస మీ యన్నిటిన్
గొని కార్యైకరతుండవై మెలఁగుకోర్కుల్ నీకుఁబుష్పించు మీ

యనుఁగుంబెద్దలు చన్నమార్గమిదెసుమ్మా కాక నీ యిచ్చవ
చ్చినరీతిన్ జరియింతువేని శుభముల్ సిద్ధింపఁబోవాంధ్రుఁడా!

ఆశాసింతురు నిన్ను నెల్లపుడు దక్షారామకాళేశ్వర
శ్రీశైలస్థిత దివ్యలింగపురుషుల్ సిద్ధంబు సర్వార్థముల్
రాశీభూతములై ఫలించు నిఁకనేలా జంకు, యత్నింపరా
దేశశ్రీవెను.పొందఁ గారణము నీ తేజంబెరా యాంధ్రుఁడా!

---

## బాష్పాంజలి

మేడల్‌గట్టిన రమ్యదేశములఁ గ్రమ్మెన్ బొమ్మవల్మీకముల్
చూడన్ గమ్మని తావితీవియల మోసుల్ మన్న పూఁదోఁటలన్
బీడై పుట్టెఁ గసింద లుమ్మెతపొదల్ విన్పించెఁ గొట్టాలలో
గూడుల్‌గట్టిన వృద్ధఘూకముల మూల్గుల్ కర్ణశూలంబులై.

వేఁటకుక్కలతోడ దీటుగాఁ గుందేళ్లు
పోరాడఁ దలకొన్న వీరభూమి
తురకరాజుల నేర్వ భరతయోధుల నిండు
శౌర్యాగ్ని రగిలిన సవనశాల
యేడునొక్కటి కొమ్ముటేన్గులు చెలరేఁగి
కవితావిహారంబుఁ గన్నచోటు
భారతీయుల జయ ప్రారంభభేరికి
మాఱుమ్రోగిన ధరామండలంబు

భోగభాగ్యంబులకు నెల్లఁ బుట్టినిల్లు
రాలజీవంబు గదలిన రాజధాని
అక్కటా కాలగర్భంబు నందుఁ జొచ్చి
జీర్ణదశఁ బొంది గాథావశిష్టమయ్యె.

అచటనే యాంధ్రుల యభిమానమును గాంచి
పెద్దన్న లేఖిని గద్దరించె
నచటనే జిలిబిలి యలరు మాటలతోడ
ముక్కు తిమ్మనగారు ముచ్చటించె
నచటనే కవిసింహ మధ్రులూటాడంగ
శ్లేష గర్జాధ్వనుల్ సేయఁగలిగె
నచటనే నవ్వుల కాదిమూలంబైన
మన రామలింగన్న మాయ లల్లె

నచటనే కృష్ణరాయ మహా మహీంద్రు
సాంద్ర కరుణాభిషేకంబు సంగమించి
పలుకు నన(బోడి ప్రాయంపుఁ దళుకులొలుకఁ
గడఁగి తొలుసారి కొనకాల గజ్జె కట్టె.

ప్రాచీనోన్నతి నేటికిం దెలుపుఁ దత్ప్రాంతీయ *పంపానదీ
వీచీ పంక్తులు చండమారుతరయోద్వేలంబులై మాటికిన్
నాచుందీవల గుంపు జొంపముల చెంతన్ గొట్టుమిట్టాడు న
ర్వాచీన ద్విజ సంకులారవములన్ వాయెత్తి వాపోవుచున్.

---

*తుంగభద్రానది

వెనువెంటన్ గవి పుంగవుల్ గదలి రా విద్యా విహారార్థులై
వనవాటి న్నరసింహ కృష్ణుఁడు కడు న్వాసించు పున్నాగ చం
దన మందార మహీజబృందముల క్రిందం గొల్వు వాటించు నా
దినముల్ వోయి శతాబ్దముల్ గడచె గాదే నేటి కవ్వేటికిన్.

కలవై పోతివె యాంధ్రలోకమునకున్ గర్ణాటరాజన్య! ని
న్నలువం జూచిన గాని మా తలఁపులోనన్ దీటుకొన్నట్టి నీ
కళకుం బంగరు చాయమేను వెడలంగా బోవ దేనాటికిన్
జెలుపన్ సాధ్యమె నీ జయాంకములఁ గాశీసేతుమధ్యావనిన్.

విరితేనియలతేట వెడలఁగ్రక్కుచుఁ బోవు
కవిచంద్రు గంటంబు గంటువడునె?
శిల్పవేత్తల కంటఁ జింది యోడికగట్టి
బాష్పాంబుపూరంబు పలవఁగలదె?
వికటరూపముఁ దాల్చి బికిరాల దేవత
గాయక సదనాల గంతులిడునె
భారతీయుల చేతి బంగారు చికిలీల
పిడిబాకునకు జంకు వొడమఁగలదె

హంపి దేవాలయంబుల యగ్రసీమ
నిట్టనిలువునఁ బుట్టలు పట్టఁగలవె
యింతకును గృష్ణరాయ మహీతలేంద్ర!
పుడమి నినుబాసి యపగత పుణ్యయయ్యె.

బంగరు చేత మా తెనుఁగు భాషకు బిచ్చము వెట్టినాఁడు *చి
త్రాంగి మనోహరుం డతని యాలయభూములలోనె కన్నె గే

---

* చిత్రాంగి విషయము చారిత్రసిద్ధము కాకపోయినను జనానుశ్రుతము.

దంగి పసిండిరేకు కవితా నవకోమలపల్లవాంగి క
న్నుంగవ విచ్చి వ్రేల్గుడిచె నోట వసారసమున్ వెడల్చుచున్.

వెన్నెల వెల్లిలోఁ జిగురు వెట్టిన దట్టపు గున్నమావి లేఁ
బొన్నలమధ్యఁ గ్రొమ్మొలక పుప్పొడి రేఁగెడిచోః శిలాస్థలిన్
సన్నని కమ్మ గాడుపుల సందడి గంటముతోడ నచ్చటన్
నన్నయ త్రవ్వె భారత సనాతన వీర కథా నిధానమున్.

ఏనుఁగు పాఁడిగా బుధుల కిచ్చిన రాజనరేంద్రుఁడుం దదా
స్థానమునందు నాంధ్రకవితాలత నాటిన సత్కవీంద్రుఁడున్
గానఁగవత్తు రీ పిదపకాలమునం దకటా! జరాభరా
ధీన యశశ్శరీరములు తేటపడంగఁ జరిత్ర సీమలన్.

పద్దెంబునకు రెండు గిద్దల వరహాలు
కొలిచిన భూనేత తొలఁగిపోయె
నక్షరంబున కొక్క లక్ష యిచ్చిన భోజ
వసుమతీశుఁడు దేవవాటికేగ
బంగారు గిన్నెలఁ బాయసాన్నము లుంచి
తన్పిన మంత్రి నిద్రాళుఁడయ్యె
కొమ్ముటేనుఁగు మీఁదఁ గొలువు దీరఁగజేసి
పురము ద్రిప్పినరాజు పూర్వుఁడయ్యె
కనక రత్నాభిషేక సంకలితుఁ జేయు
రసిక చంద్రుండు కాల వారాశిఁ గ్రుంకె
జోలెఁ గట్టించు ననుఁగు టిల్లాలితోడఁ
బ్రతికి యున్నాఁడు కవి మందభాగ్యుఁ డొకఁడె.

మనినా రెండఱొ మండలాధిపతు లీ మా తెల్గు మాగాణిలోఁ
జనినా రెండఱొ సుందరాకృతుల హింసాసూత్ర పారాయణుల్
గనినా రెండఱొ మాతృదేవతలు రాకాచంద్రులం గాలమా !
తినినా విందఱఁబట్టి భూతదయ లేదే నీకు నే నాడిలోన్.

---

## ఆచార్యాభివందనము

వర సముద్రాల వంశ సంభవుని లక్ష్మ
ణార్యు గుదిమెళ్ళ గోత్రు శ్రీయంత్రవేది
నారసింహార్యు నాత్మలోనం దలంతు
నంజలి ఘటించి భక్తితో ననవరతము.

పుత్ర నిర్విశేషంబుగాఁ బూఁచిపట్టి
తర్క వేదాంత విద్య లుదాత్తరీతిఁ
జెప్పి కరుణారసంబు పై గుప్పినట్టి
పరమ గురుదేవు లీ మహాభవ్యమతులు.

---

## పితృపూజ

అంబుజోదరచింతనామృతానందుఁడై
లోకంబు నెవఁడు తృణీకరించు
యతిరాజసిద్ధాంత చతురుఁడై యెవ్వాఁడు
బద్ధచేతనుల సముద్ధరించు
గంగాతరంగ వాక్సంగంబుచే నెవ్వఁ
డరివాది భీకరుం డనఁగఁ బరగు

భూతదయాపూర్ణ చేతస్కుఁడై యెవ్వఁ
డనిశంబు దీనుల నలరి ప్రోచు
నెవఁడు గోపీవిలాసాద్యనేక కావ్య
కర్త, కాఁపుకులానికిఁ గనకమకుట
మా సుచారిత్రు వేంకటదాసవర్యు
సాధుజనసేవ్యుఁ బితృదేవు సన్నుతింతు.

సతి యరుంధతియైనఁ బతిభక్తిగరిమలో
సాటిరానోపదో జనని! నీకు
మందస్మితముతోడి మధుర సంభాషణం
బజహత్స్వభావమో యంబ! నీకు
నిరుపమానంబైన నిరతాన్నదానంబు
పెట్టని తొడవు సవిత్రి! నీకు
శాంతిమై కార్యముల్ చక్కఁ గావించుట
తఱుగని విభవంబు తల్లి! నీకు
భరత మహిళానుభావ సంపత్తియెల్ల
మూడుమూర్తుల నీలోన ముద్దగట్టె
నమ్మ! నీబోటు లవనిపై నరుదుసుమ్మ
రమ్యసుగుణావలంబ శ్రీ రాధమాంబ!

పుణ్యదంపతు లీ్వరికిఁ బొడమినట్టి
సుత చతుష్టయమవదాత శుద్ధచరిత
మందు మూడవవాఁడ నే నిందువదన
లిరువు రనుజాతలును నుండిరింక మాకు.

---

## కృతి సమర్పణము

కృతికన్యామణి! పూర్వసంచిత తపోరేఖావిశేషంబునం
బతి ప్రాప్తించె యశోవిరాజితుఁడు సౌమాంగల్యమేపార, నీ
చతురోద్యోగ విలాసభావముల నే చందాన మెప్పించి య
ద్భుత కీర్తుల్ విరజిమ్మ నేర్తువొగదా పుట్టిల్లు శోభింపఁగన్.

భవితవ్యంబెటులున్న నట్లయగు సంబంధంబు లైదాఱు మా
కవితాకన్యకు వచ్చెఁగాని కడకున్ గావ్యైకలోలాత్మవై
భవునిన్ గన్నయచౌదరీంద్రుని వరింపంగల్గె నీనాడు, నే
నవిచారంబుగ నా కళారతునికే యర్పింతు నేలా! పరుల్.

నరసాధీశ్వరుఁ గృష్ణరాయ జగతీనాథాగ్రణిన్ భోజునిన్
బురుడింపంగలవాఁడు మా కృతిసతీ పుణ్యప్రభుండన్నఁ, ద
చ్చరితంబున్ వినిచూచి కొంచెమెఱుఁగన్ సాధ్యంబు కాకిట్లు నా
తరమే తేరకుఁదేరఁ జెప్పఁగఁ దదౌదార్యప్రభావోన్నతుల్.

ఆ విమలాత్ముఁ డొక్క దినమందు ననుం బిలిపించి యుక్త సం
భావనసేసి యిట్లను "నపార కవిత్వ సుధానిధాన! మీ
పావన వంశమే మధురపాండితికి న్నిలయంబు కాక బ్ర
హ్మోవహితుండు మీ జనకుఁ డంతట సుప్రథితుండు గాఁడొకో.

సన్నుత కీర్తిశోభితదిశా! భవదీయ వయోవిలాసముల్
చిన్నవిగాని వైదుషి విశేష మఖండము గాఢహర్ష సం
పన్నతనొందె మీయెడ నమాంతము నామనమట్టులౌట, మా
కున్నయ మొప్పఁగాఁగృతియొకొం డెలమిన్ రచియించియీయరే.

క్షితిని నశియించు నన్నియుఁ జివరకొక్క
కృతియె యా చంద్రతారార్క మెసఁగు దాని
రక్తి ఘటియింపవయ్యా మరంద మధుర
మందిరానందసందోహతుందిలముగ.

అని వ్రాకుచ్చి సమాదరంబు మెయి నన్నర్థించెఁబో నాఁడు నే
విని తత్కావ్య రసానురాగ మెదలో వేనోళ్లఁ గీర్తించి యీ
గొనబుం బ్రాయపు వన్నెలాడి నిదె గైకొమ్మంచు నర్పించితిన్
దెనుఁగుం బోకడ తీర్చెఱుంగులకు నాధీరుండ హా వెట్టఁగన్.

అక్కట నల్వదేండ్లపయినందిన గన్నయ చౌదరీశ్వరుం
డెక్కడి యల్లుఁ డిర్వదికి నించుక పైబడు నేను మామనా
టెక్కడ చక్కనయ్యె నిది యెంతయు మాకనురూపమానటుల్
నిక్కము భారతీ సతి యనింద్య కృపాగరిమానుభూతిచే.

చతురవచోరచనామృత
యుతయగు నా కృతికి భర్త యుజ్జ్వల గుణముల్
వితతీకరించి చెప్పుట
పతిహితచరితాంగనా స్వభావముగాదే.

కత్తి కట్టి చేతఁ గైకొని సకలాంధ్ర
మండలంబు తొలుతనుండి బ్రోచు
బిరుదుగలవి నాల్గు సరిపోలు సుమి రెడ్డి
వెలమ, కమ్మ, కాఁపు, కులము లెందు.

బాకున శత్రుసైన్యములఁ బాఱఁగఁ దోలి బలప్రభావముల్
చేకుఱ నెట్టివేళ తమ చేయిపయిన్ బెనుపార నాంధ్ర భూ

లోకము నేలె నీ తెఁగ లలుప్తమహామహిమానుభావ సు
శ్రీకములై యఖండల హారీకృత దివ్య యశస్థిరంబులై.

అట్టి కమ్మవంశమున మేకాన్వయంబు
భోగభాగ్యాస్పదంబయి పొలుపుఁగాంచి
యెల్లవారికిఁ జూడఁ గన్నెఱ్ఱగాఁగ
వెలయుఁ బూచిన తామర కొలఁకువోలె.

అందుదయించె నార్యనుతుఁ డంజయ చౌదరి పెండ్లియాడె భా
గ్యేందిర రంగమాంబ, జనియించిరి వీరికిఁ బుత్రు లార్వ రా
నంద గుణాభిరాములు జన స్తవనీయ చరిత్రు లద్రిరా
ట్చందనకుందచందిరయశఃకలితుల్ పితృపుణ్య మెట్టిదో.

మందమరాళయానలు కొమారిత లైదువు రుద్భవించి రా
చందన గంధు లందఱును జక్కని కాఁపుర ముల్లభింప శ
త్రుందములైన భర్తల మతుల్గొని ముచ్చటగాఁ జరింతు రీ
యందఱుగూడి కొల్తు రట యంజయ చౌదరిఁ బోలవచ్చునే.

చౌదరి చంద్రు భవ్యమగు సంతతిలోఁ బ్రథముండు కావ్య క
న్యాదయితుం డమేయ కరుణానిలయుం డతి లోక భోగ భా
గ్యోదయుఁ డార్తరక్షణ సముజ్జ్వలుఁ డాంధ్ర కవిత్వ తత్త్వ స
త్యాదరుఁ డొప్పు గన్నయసమాఖ్యుఁ డనుత్తమమార్గదర్శియై.

అభినవ కృష్ణరాయఁ డగు నా మహనీయుని నిత్యసత్కళా
విభవము గోచరించు సుమి విస్ఫుటమై ముఖమందుఁ బండిత
ప్రభులె వసింతు రెల్లపుడు పజ్జల నౌర తదీయ జాతక
ప్రభ యదియేమొ పట్టుకొన బంగరు, ముట్టినముత్యమేయగున్.

తోఁవను బోవు భట్టకవిఁ దోడ్కొనిపోయి దయారసంబు పెం
పావహిలంగ రూపకమయంబగు తత్కృతి నచ్చువేయఁగాఁ
జేవిదలించె విత్తమిటు చేసెడి పూర్ణ కళాభిమాను లెం
దే విధివ్రాలుదప్పి జనియింతురు సుమ్ము ఘుణాక్షరంబుగన్.

ఎన్నటికైన మంచితన మేర్పడఁ బోవదు నల్వ! నీకు మా
గన్నయ చౌదరీశ్వరు నొకానొకనిన్ సృజియించితేమి ? త
త్సన్నిభులన్ రసజ్ఞులగు దాతల నల్వుర నింక సృష్టి సే
య న్నిను గొట్టిరే! కవుల యాపద దీఱెడిదే యటైనచోన్.

గొప్పఁదనంబు పెంపొరులకున్ మునుముందె విశాలనేత్రముల్
చెప్పకచెప్పు జానుయుగళిన్ గడదాఁకెడి బాహువుల్ విరుల్
గుప్పెడి దంతమౌక్తికములు న్నిడునాసయు భోగభూతికిం
జొప్పడులక్షణంబులగుచుం దగుఁ జామనిచాయ మేనికిన్.

మందహాసంబుతో గాని మాట వెడల
దట్లు వెడలిన పలుకున కన్యథాత్వ
మొందనేరదు నభమూఁగి క్రిందఁబడిన
సుగణనిధియైన యా పరిశుద్ధమతికి.

ఏనుఁగు పాఁడిగా నిచ్చివైచుటెగాని
పరులచేతికి నాసపడుట లేదు
మకరందమొలికెడి మధురవాక్కులె గాని
పరుషంబు లెప్పుడు బయలువడవు
పూఁచిపట్టినసేఁతఁ బూరించుటయె గాని
నడుమ వర్జించు టేనాఁడు లేదు

చాకచక్యంబున సాహసించుటెగాని
మనసుమెత్తన జంకుగొనుట లేదు

శాంతిదైవాటు నెట్టి దుర్జనులనైన
ముద్దుసేయుటయే గాని ముత్తెమంత
కోప మెనయదు తన్మనఃకోశమెంత
పాటువడియెనో సామ్యభావ ప్రసక్తి.

రాజకీయంబునఁ బ్రాభవోన్నతిఁ గాంచె
మంత్రివర్గముదాఁక మాటబనిచి
పలుచోట్లఁ బెక్కువ్యాపారంబు లొనరించె
నాంధ్రుల యభిమాన మవధరించి
దిగ్వితానమునందు దివ్యకీర్తులు సల్లె
నర్థికోటులనెల్ల నాదరించి
కవితాకళాదృతి కనుపట్టఁగాఁ జేసె
మతిమత్కవీంద్రుల కృతులఁబొంది

యింక నుజ్జ్వలగుణములెన్నెన్ని జాటి
పోయెనో నాదుకలమునఁ బొందకుండ
నతఁడు సామాన్యజనుఁడె సువ్రతగరిష్ఠుఁ
డస్మదనవద్యకావ్య కన్యావరుండు.

ఏతాదృశ బహుగేయున
కాతతదైవార్చనాసమంచితమతికిన్
జేతోవిభవతిరస్కృత
ధాతకు నరిజేతకతులధర్మాత్మునకున్.

పడుచుం బెండ్లమవైతి వాతఁ డవికంప్యప్రేమభావంబుతో
నడచు న్నీయెడ నాంధ్రలౌకికకళానాథప్రసంగంబులన్
బాడమున్ బ్రప్రథమ స్థలంబు నిను నామోదించుటం జేసి యి
బ్బడిమై యాతని కున్నతప్రకృతు లొప్పన్ గావ్యకన్యామణీ!

కృతిచంద్రా! నినుబోటి పుణ్యపురుషుం గీర్తింపఁగాఁగల్గెఁ దద్వ
త్పతికత్వంబునఁ గావ్యలక్ష్మి గుణసౌందర్యాదు లున్మేషవి
శ్రుతరూపంబుల వాఙ్మయంబు నలరించుంగాత నీ మార్గ మా
యతమై సొంపొడఁగూర్చుగావుత భవిష్యద్భారతక్షోణికిన్.

ధనధాన్యాలయవృద్ధితోడఁ గృతినాథా! నీవు వేయేండ్లుగా
మను ముయ్యాలలు వేసి నీ మృదుయశోమాణిక్య ముగ్ధాధరల్
గొనబుం గమ్మని గాలిపాటలఁ దెలుంగుం బిడ్డ జోకొట్టి తీ
యనినిద్రన్ సొగయించుచుండుదురు లెమ్మా చంద్రతారార్కమున్.

---

# వాసంతిక

## శృంగారము

ఖండఖండాంతరంబుల గణుతికెక్కి
మిసిమి బంగారు వాసనల్ విసరునట్టి
భరతదేశంబులో నొక్క పట్టణంబు
పొదలు నెనలేక పాటలీపుత్ర మనఁగ.

పాఁడికిఁ బంటకున్ గొదువబాటను మాటయె లేదు వీథిలో
మాడకుఁ బుట్టెఁ డమ్మును సమస్తము, పెద్దమదేవి కింత కా
లాడఁగఁ దావులేదు పరిహాసము చొప్పునకైనఁ గాని తా
మాడిన మాటఁ దప్పెడుమహాత్ములు లేరటఁ బట్టిచూచినన్.

ప్రతిమాకావ్యశతంబు లల్లఁగల శిల్పబ్రహ్మకున్ దెల్ల కా
గితమందు న్నవఖండముల్ ముడుచు శక్తింగన్న మావారికిన్
గతుకం గంచములేక పంచలబడిన్ గారాడు వ్రాల్లేదు పో
నతి దూరంబున నున్నదా పుర మసూయాభ్రష్టదుష్టాళికిన్.

తామసవేళదాఁక మెయిఁదాఁచక సస్యసమావృతంబు లౌ
భూములలోననో పురముపొంతలనో పనిచేయు కార్మిక
స్వాములెగాని దేశసమశాంతిలతాళికిఁ జీడపుర్వులా
సోమరిపోతులున్ వచనశూరులు గన్పడ రెందుఁజూచినన్.

చక్కని పూలతోఁటల ప్రశాంతతలంబులనుండి చప్పరా
లెక్కి చరించు చల్లని సమీరము లచ్చటి పూవుఁబోండ్లనుం

జెక్కుల ముంగురుల్ నిమిరి చెంగటఁగట్టిన చాందినీలలో
నక్కి గవాక్షమార్గవలనంబుల గ్రిందికి దాఁటు నిత్యమున్.

రతనాల్ చెక్కినగచ్చుమేడలపయిన్ బ్రాహ్మీముహూర్తంబులో
శ్రుతినాదంబున మేళవించి నగరీశుద్ధాంతకన్యల్ స్వభా
రత దేశీయ జయాంక గేయములఁ దారస్థాయిలోఁ గ్రొత్త సం
గతులం బాడుదు రిందుకాంతమణిలోకంబెల్ల బిందింపఁగన్.

భూతదయాపరుండు పరిపూర్ణకళావిషయజ్ఞుఁ డెన్నడున్
నీతిపథంబు దప్పని యనింద్యచరిత్రుఁడు శాంతి శౌర్య మాం
ధాత జయంతసేన నరనాయకుఁ డా పురమేలుఁ గీర్తి చం
ద్రాతపముల్ దిగంతరవిహారము సేయ గుణాభిరాముఁడై.

అతని యనుంగురాణి కమలాంబిక పచ్చని పైడిబొమ్మకున్
బ్రతియగు ముద్దరాలు నరపాలున కెత్తిన భాగ్యరేఖ ది
క్తతులకుఁ బేరువడ్డ బహుదాన గుణాలయ సర్వవేళలన్
బతియె పరాత్పరుం డనెడి భావముతో నిలు దిద్దు ముద్దుగా.

ఆస్థాన తంత్రంబు లధిపుఁ డాలోచింప
శుద్ధాంత కార్యముల్ చూచు నతివ
వనమధ్యమున భర్త గనిమలు గట్టింపఁ
బూలతల్ నాటించుఁ బూవుఁబోఁడి
కొనగోటఁ బతి వీణియను మీటి వాయింపఁ
గలికి యాలాపించుఁ గంఠమెత్తి
కీరపంక్తుల తేఁడు నీరంబుఁ ద్రావింపఁ
గవణంబు లందిచ్చుఁ గజ్జలాక్షి

రత్నమయ దివ్యసౌధాంతరములలోన
నుడుటు బంగారు టూయెల నూఁగుచుండి
ధరణినాథుండు లీలఁ బద్యంబు నుడువఁ
దెనుఁగు వ్యాఖ్యాన మొనరించు వనరుహాస్య.

అనుపమ రాజ్యభోగముల నందుచు ముట్టినదెల్ల ముత్యమై
తనరఁగ నిట్లు రాజకులదంపతు లుండఁగ యౌవనంబునన్
జనియెను బూర్వరంగము గనంబడె దేహములందు నప్డు హృ
ద్వనజవికారహేతువులు భావి జరాపరిణామసూచనల్.

అంతిమ యౌవనంబున నృపాగ్రణికిన్ దన రాణియందు రే
యంతమునందు భానుఁడుదయంబగు మాడ్కి జనించెనొక్కఁడే
కంతుజయంతులం గెలువఁగాఁదగు చక్కని ముద్దుబిడ్డఁడా
శాంతములెల్ల నిర్మలములై చెలువారు శుభోదయంబునన్.

ఐదువ పైదలు లప్పుడు
బూదలఁ బన్నీరుదెచ్చి పోసి మనంబుల్
మోదమునఁ జిగురులెత్తఁగ
గాదిలి పాపకును బురుడు గావించి రొగిన్.

పచ్చల తొట్టిలోఁ జలువపానుపుమీఁదఁ బరుండఁబెట్టి మే
ల్మచ్చులలోన దాదులు క్రమంబుగఁ బూర్వపు రాజకేసరుల్
విచ్చుకటారులం దొఱగి వీరవిహారము సల్పినట్టి యా
సచ్చరితంబు వాడుచును సాకిరి తేని యనుంగుఁ బుత్రునిన్.

తల్లిదండ్రులు మిన్నంది యుల్లసిల్ల
ముద్దు మాటల నుడువుచుఁ బూర్వపక్ష

మందు నభివృద్ధిగాంచు లేఁ జందమామ
కరణి నల్లారు ముద్దుగా బెరిగె శిశువు.

పెట్టిరి పుష్పసేనుఁడని పేరు కుమారకుఁ డైదువర్షముల్
దొట్టినయంతనే పరువుదోలుట గుఱ్ఱపుస్వారి పందెముల్
గట్టి పెనంగుటల్ మొనలుగట్టుట మున్నగ మూలముట్టుగాఁ
బట్టి గ్రహించె విద్యల నభంగుర శౌర్యబలానుషంగుఁడై.

కాళిదాసాది సత్కవికల్పితంబు
లైన కావ్యంబు లన్నిటి నాకళించె
గౌతమీయాదిశాస్త్ర సంగతు లెఱింగె
నుత్తమార్యుల యొద్ద మహత్తరముగ.

చిన్నారి పొన్నారి చిగురుప్రాయమునాటి
యాటపాటలరక్తి యస్తమించె
సహజ కోమలమైన శారీరసీమలో
నభినవ లావణ్య మవతరించె
నునుపుఁ గాటుకవన్నె నూనూగుమీసంబు
మూతిపై నొకకొంత మొలక సూపెఁ
బుష్పబాణుని వాఁడి పూవుటమ్ముల దాడి
యస్తుబిస్తుగ ధైర్య మపహరించె

నుక్కుగత్తుల "పారాల" నొదిగియున్న
యుత్తమస్వాంతమునఁ గూడఁ దత్తరంబు
సంతరించెడు మిసమిస జవ్వనంబు
కందళించెను నరనాథ నందనునకు.

అంతఁ బ్రశాంతమారుతనిశాంతము సంతతకంతుకేళికా
క్రాంతవనాంతరావసదకంటకకుంజకుటాంతరాళది
క్ప్రాంతము పుష్పితాఖిలలతాంతము చింతితపాంథసంతతి
స్వాంతము గంధవంతము వసంతము వచ్చె నితాంతకాంతమై.

వెన్నెల తీర్చికాసె నడువీథుల నిర్మల గౌరవర్ణసం
పన్నత బాహ్యదేశములఁ బండినవారికిఁ జంద్రమండలో
త్పన్నతుషారబిందుపరిపాతసుఖస్థితిగల్గె నిద్రలో
గన్నులపండువల్లఖిలకాననభూములు పూచె నిండుగా.

చిగురు చింతలగుంపు చివరకొమ్మల కెక్కి
పంచమస్థాయిలోఁ బాడె పికము
మకరందసీధువు మత్తులోఁ బడిమ్రోసె
ఝుమ్మన నెలదేటి తుమ్మెదఱేఁడు
పూఁతమామిడిచెట్ల లేఁతకొమ్మలలోన
లీనమై విహరించెఁ గూనచిలుక
యివురు బట్టిన శైల వృక్షపంక్తులఁజూచి
గొనబు గొండిలి సల్పె వనమయూరి

పరగఁ జైత్రుండు మరునకుఁ బథికహృదయ
భేదన మొనర్పఁ బిడిసానఁ బెట్టియిచ్చు
దుమ్ముదుడిచిన జిగివాలుఱమ్ములనఁగఁ
బొడమె నారామముల మల్లెమొగడ లపుడు.

అతులితంబైన యీ వసంతాగమమున
మాడిపోయిన ముదుసలి మానసములఁ

గూడ రాగాంకురంబులు గూడు ననఁగ
మొలకచిపురులు గనుపట్టె మ్రోఁడులందు.

నానానిర్ఝర నిర్మలాంబువుల లోనంగ్రుంకి నూత్నాబ్జసం
తానామోదపరాగధూళులనువొంద న్మేననల్లార్చి వ
ల్లీనాళీకముఖీజనంబులకుఁ గేళీలాస్యముల్ నేర్పఁగాఁ
దానై చొచ్చె సమీరదేశికుఁడు కాంతారప్రదేశంబులన్.

కిలకిల గూయు కోయిలల కేకలకున్ మది నుబ్బియాడుచున్
జెలువుగ విచ్చు పూఁబొదల చెంగట ముద్దుగ ముచ్చటించుచున్
గలిగిన నవ్యదంపతులు కాలముపుచ్చ దినాంతవేళలన్
మెలఁగిరి జంటగా వలపుమేలములాడుచుఁ బూలతోఁటలన్.

ఆ మధుమాసవేళ వసుధాధిప నందనుఁ డొక్క వేకువన్
గోమల వాతపోతముల కొత్తల కల్లన మేలుకాంచి హృ
త్తామరసంబుఁ గొంతవడి దైవపదంబుల నిల్పి కాల్యసం
స్తోమము లన్నియు న్నిగమచోదితరీతి ముగించి పిమ్మటన్.

నా చిననాటి హితుండు మ
హాచాతుర్యయుతుఁడు మధురాలాపుం డే
యే చందంబున నుండెనొ
చూచి చిరంబయ్యె వానిఁ జూడఁగవలయున్.

అని మనసార నొక్కపరి నాత్మసఖున్ దలపోసి వెంటనే
జననికిఁ దండ్రికి న్వినయసంభ్రమ మొప్పఁగఁ దెల్పి వారిచే
ననుమతిఁగాంచిమారుతరయంబునఁబోయెడియుత్తమాశ్వమున్
గొని చనె సింధుదేశమునకున్ హితు జూడ లెఱుంగు కోరికన్.

కతిపయ ప్రయాణంబుల గహనశైల
నిమ్నగా దేశములనెల్ల నిస్తరించి
యనుఁగు మిత్రుండు నివసించునట్టి పురముఁ
జేరుకొనియెను రాజకుమారకుండు.

తనుఁ జూడవచ్చు భూవర
తనయాగ్రణి నింటి బయటి ద్వారముకడనే
కనుగొని మధురాలాపుఁడు
తనువునఁ బులకాంకురములు దట్టముగాగన్.

ఎదురుగ డాయవచ్చి నవుటీరికలాననసీమఁదోప నా
సదమలపుణ్యరాశిఁ గనఁజాలితిఁ గన్నుల కర్వుదీఱ మా
సదన తలబుఁజేరె నిధిసంపద యంచుఁ బ్రమోదబాష్పముల్
సెదరఁ గవుంగిలించి వికచీకృతదృష్టుల ముంచివేసినన్.

కనుఁగొని పుష్పసేనుఁడు పకాపకనవ్వి వయస్యరత్నమా!
నినుఁ దిలకింపఁగాఁగలిగి నేటికిఁజెల్లె "సుమారు" పంచహా
యనములదాఁక నన్మఱచితౌ హృదయంబునఁ గాకయున్న పా
వనహితసంగతప్రణయబంధము నిన్నిటు లుండనిచ్చునే.

వేగుంజామున మేలుకాంచి విధులన్ వేదోక్తమార్గంబుగా
సాగింపంగలవే యనారతము నీ సంసారసందర్భముల్
బాగై యొప్పునె తల్లిదండ్రులకు నాపాదింతువే సమ్మదా
భోగంబుల్ కడుపారఁగాంచిన ఋణంబుల్ దీరఁబూజించుచున్.

అనినఁ జనవున మధురాలాపుఁ డంతటి
నట్ల యొసఁగుననుచు నతనితోడ
నట్ల.

భవనసీమఁ జొచ్చి బంగారు బల్లపై
గూరుచుండఁబెట్టి కొలిచె మిగుల.

జిలుఁగుంగూఁకటి చిన్ననాఁడు బడిలోఁ జెండ్లాడు వృత్తాంతముల్
దలఁపించుం జెలికానితో నొకట నిద్రా భోజన వ్యాప్తులన్
మెలఁగున్ గంఠగత ప్రమోదమున క్షోణీనాథ పుత్త్రుం డిటుల్
సలిపెన్ వాసముఁ గొన్నినాళ్ళచట నిచ్ఛాగోష్ఠులం దేలుచున్.

ఒక్కనాఁడు పశువు లూరఁ జొచ్చెడి వేళ
వీటి రాజపుత్ర వీరులెల్ల
సింధు సైకతములఁ జెలువారఁ బావురా
పందెములను వేయఁ బఱచుచుండ.

మునుకొని మధురాలాపుఁడు
తన భవనమునందుఁ బెంపుఁదనముం గను దె
ల్లని కలరవముల రెంటిని
గొని చనియెను సఖునితోడ, గున గున నపుడే.

జరఠార్క నాతపస్పర్శచేఁ దళతల
లిసుక రేణువులందుఁ బొసఁగుచుండఁ
గలువ పూవులలోని చలువ పుప్పొడి లెత్తి
మలయవాయువు చుట్టు మలసిచిమ్మ
నెడనెడ వ్రాలుచుఁ దడుపు ఱెక్కలుగొట్టి
కొలకొల జలపక్షికులము గూయ
ఱేవు కట్టలదాఁకు పూవు వాగల శబ్ద
మల్ల నల్లన వచ్చి యావరింప

నొప్పు సింధునదీ పులినోర్వులందుఁ
గుంపుగాగూడి నెఱరాచకొమరులెల్లఁ
బందెములు గట్టి తమతమ పావురాల
వదలిపెట్టిరి వ్యోమార్ణవంబుఁ దఱియ.

పూవుపిసాళి వన్నియలఁ బొల్పగు ఱెక్కల విప్పికొట్టి పా
రావతపోతముల్ దిన జరాగతిరోహితమైన యెండ క
ట్టావిరి కాంతిలో నెగిరి యాడుచునుండ వెలింగె నూత్న శో
భావిమలంబులై గగనభాగములెల్ల మనోహరంబుగా.

అపుడు పుష్పసేనుఁ డలరి మిత్రుని పావు
రంబుఁబట్టి యొక్క రాజపుత్రు
కలరవంబుతోడ గెలు పోటములలోన
పణము నొడ్డి విడిచెఁ బైకి బాల.

విడిచిన యంతనే సఖు నవీన కపోతము పాఱఁజూపెఁ బే
రడుపుల దారిఁబట్టి యది యంతయు నారసి పార్థివాత్మజుం
డుడుగక నిర్నిమేషమయి యొప్పు కనుంగవ నింగిఁ జూచుచున్
నడచెను దాని వెంటనె మనంబు పరిగ్రహణాగ్రహంబుగాన్.

వెనుకొనిపోవుచున్న నృపవీరకుమారుఁడు కొంతసేపు క
న్గొనియె వియత్తలంబున శకుంతము సాంగ విమర్శదృష్టి నా
వెనుకఁ దదన్యసంశయనివిష్టమనస్కత సూక్ష్మరూపమున్
గనియె ననంతరం బతఁడు గాంచెను వట్టి బయల్ నిరాశుఁడై.

అంతఁ గపోతగ్రహణో
దంతంబున నాసవిడిచి దైన్యంబున భూ

కాంత కుమారుఁడు దుర్భర
చింతాకులితాంతరంగసీమాన్వితుఁడై.

మరుదంకూరపరంపరాహతిగళన్మారందధారాంబుజాం
తరసంసర్గనిసర్గ శీతలనదీనవ్యోర్మికాశీర్ణశీ
కరసేకార్ద్రశిలాతలంబుపయి మార్గశ్రాంతిఁ బోకార్పఁగాఁ
గురరీకూజితలోలుపశ్రవణుఁడై కూర్చుండియున్నంతటన్.

కురవకంబులుచాలు హరివాణ మిదినిండఁ
జంపకంబులఁ ద్రుంపు శారదాంబ!
మందారకుసుమంబు లందకుండెను దీని
కొమ్మఁ గొంచెము వంచు కుముదవల్లి!
బొండుమల్లియమీఁద గండుతుమ్మెదమ్రోసె
మగిడిరమ్మటువోక మంజువాణి!
తలిరాకులిం కేల తడవామె నిటువచ్చి
జననికోపించునో చంద్రరేఖ!

చండకరుదీర్ఘరశ్ములు శైల శిఖర
సానుభూముల నసివాఱు సలుపఁదొడఁగె
మసకవడుదాఁక నచటనే మసలుదేమి
సాగిరావమ్మ వేవేగ శ్యామలాంబ!

పూచిన కన్నెతీఁగె నునుబోకఁ బెనంగిన తీరు నూఱికే
జూచెద వేలకో త్రిపురసుందరి! హా! తెలిసెన్ వచింపకే
దాచిన దాచుకొమ్ము గఱుదాల్చిన నిద్దపుఁ జెక్కుటద్దముల్
సూచన సేయవే విశద సూక్తుల నీదు మనో రహస్యమున్.

ఈ కమనీయవల్లి పదునేను దినంబులలోనఁ బూయు నౌ
గాక దివావసానపరికల్పితశీతలసేచనంబులన్
సాకితిఁ గాన దీని తొలుసారి ప్రసూనము నొక్కటేనియున్
మీ కొసఁగంగ బోవను సుమీ చెలులార! నిజంబు నమ్ముడీ.

అను పలుకుల్ దినాంత సమయంబున సాగెడి మందమారుత
స్వనముల తోడఁగూడి తన చక్కటికిన్ వినవచ్చెఁ దిన్నఁగా
వనతరువల్లికాదళవివర్ధితగంధవహాంకురాహతి
ధ్వనితవిశాలవేణుసముదంచితనాదమనోహరంబులై.

ఆ మాటలు విని యిది యా
రామస్థలి యిచట రాజరాజాస్యలొగిన్
గోమల పుష్పాపచయ
వ్యామోహితలై చరింప నగునని వేడ్కన్.

సన్నని గాలికిన్ గదలసాగిన రెల్లు పొలాల మధ్యలోఁ
దిన్నని బాటనేగె నరదేవకుమారుఁడు కార్తికంబునన్
బన్నిన పాండురాంబుధర పంక్తులలోఁ బయనించుచున్న యా
వెన్నెలరేని పోల్కిఁ గనుపించుచు మాటల సన్న నాదెసన్.

అట సని సింధుధునీఘున
తటభువిఁ గన్గొనియె సైకతంబున నొకచోఁ
గుటజ కురంటక మల్లీ
స్ఫుట కుసుమామోదియైన పూవుందోఁటన్.

చల్లని నీడలం బెనుపఁజాలిన దట్టపు నారికేళముల్
మల్లడిగొన్న వన్నిదిశలన్ దగు నావృతిగాగ వానిపై

నల్లుకొనెన్ లవంగ లతికావళు లంతర మింతలేక యు
ద్యల్లలితభ్రమీభ్రమరతాడనసంచలితచ్ఛదంబులై.

విమలసుమసురభిళములై
క్రమమున దోఁగాడు కన్నెఁగాఁపు తరఁగల్
భ్రమసి యెదుర్కొన నృపసుతుఁ
డమితానందమున వనమునందున్ జొచ్చెన్.

వ. అది చతురస్రంబుగా విభాగింపఁ బడియుండె. నడుమ చంద్రకాంత శిలా నిర్మితంబైన హర్మ్యం బొండు గలదటనుండి నలువైపులకు నసంబాధంబులై యీషదున్నతంబులైన సైకత మార్గంబు లొప్పారు. బాటల కిరుప్రక్కల నాతి విరళంబులై మందార మల్లీ కురంటక మాధవీ యూథికాదిలతలు, కుసుమ మంజరీభారావనతంబులై యుండె. నడుమ నడుమ బాల మాలతీ వల్లికలు నాటంబడె. నభినవ జల పూరితంబులైన తదాలవాలంబుల చుట్టు బరివేష్టించి కలవింకపోతంబులు పాతరలాడఁజొచ్చె. మిగిలిన భాగంబంతయు, తరళ తరంబు లైన చప్పరంబులతోడను, కోమలంబులై సాంద్రచ్ఛాయంబు లైన సహకార పున్నాగాది వృక్ష పంక్తులతోడను సహజ సౌందర్య నిర్మలంబై ప్రశాంత సికతిలంబై, కనులకుఁ బండువు గావింపఁ జొచ్చె. నందుఁ బుష్పసేనుండు విహరించుచు, దక్షి ణంబున,

చిన్నిపసిండి పళ్లెములఁ జేకొని చంపక రమ్యవాటిలోఁ
బన్నగ వేణికల్ వెనుక భాగములందు నటింప నూతనో

ద్భిన్నములైన పూగెలల వేఁడుకపాటునఁ గోయుచున్న రా
కన్నియలం గనుంగొనియెఁ గైరవపత్రవిశాలనేత్రలన్.

మద కోకిలారవంబుల
సదలింపఁగ జాలు వారి యాలాపములన్
ముదితుఁడయి వినుచుఁ జేరెను
సదమల వనమధ్య రత్నసౌధము కడకున్.

ఆ రమణీవిహారనిలయాంగణమందలి పోకమ్రాని పై
కూరుకువెట్టు శారిక నికుంచితకంధరమెత్తి పల్కె "నో
భారత వీరవర్య! యిదె స్వాగతమంచుఁ దదీయ మంద గం
భీర నినాదమున్ విని సమీప మణీమయ పీఠికోపరిన్.

శ్యామలవేణి పాశములఁ జారు సుమంబులు గూర్చుచున్న క
న్యామణు లిర్వు రట్టి తమ యాననముల్ మగిడించి యావన
శ్రీమహితున్ మనోహర శరీరు నరేంద్రకుమారుఁ జూచి, కాం
చీమణిదామముల్ రవళిసేయఁగ లేచిరి సంభ్రమంబునన్.

అందొక చందనాంగి శరదంబుదచంద్రపటీరవర్ణ, య
ర్ధేందులలాట వేఱొక తె, హేమలతా ప్రతిమాన గాత్రి, చె
ల్వొందిన కల్వరేకు లొక యాబిడ కన్నులు, బెళ్కుచేపలన్
న్నింద యొనర్చు నొక్కతరుణీమణి దీర్ఘవిశాలనేత్రముల్.

బంగరువంటి చాయగల బాల యొకింతకుఁ గన్నుగీటఁ దా
రాంగనఁబోలు రెండవది యా మణిపీఠము ముందువైచి న
వ్యాంగజరూప! రమ్మని యొయారముగా నొక ప్రక్కనిల్చె నం
తం గలితాసనుండయి ముదంబున రాజకుమారుఁ డామెతోన్.

చకితహరిణాక్షి! మీర లే జనవరేణ్యు
ప్రియకుమారిక లిద్దటి పేరులేమి?
యింద్రు నారామ వాటిక నీసడించు
నీ, లతా కోమలోద్యాన మెవరిదమ్మ.

అని పలికిన విని లజ్జా
వనతాస్యము నోరజేసి వనితామణి, యి
ట్లనియెన్ వీణాకలకల
నినదంబుల నేవగించు నిర్భర ఫణితిన్.

సంతత వైభవోజ్జ్వలిత సంపదలన్ దులదూగు సింధు భూ
కాంతుని ముద్దుకూఁతురు జగజ్జనతాదరణీయశీల! వా
సంతిక యండ్రు పేరు, నరచంద్రుని ప్రాణపదంబుగా విలో
కింతురు బంధుమిత్రులు సఖీగణకల్పక మీమె; ధీనిధీ!

సిద్ధసంకల్పుఁడైన మా సింధురాజు
ననుఁగు దమ్ముండు వసుపాలుఁ డనఁగఁ బరగు
నతని కౌరసతనుజాతనైన నన్ను
క్షితిని, మణిమాల, యనుచు వచింతు రార్య!

మంజులతానికుంజమిది మా యవరోధకులాంగనామణుల్
సంజకడన్ విహారములు సల్ప రచించిన పుష్పవాటి పూ
వుం జిగురాకుగుత్తులదె బుట్టల కెత్తుచు నున్నవారు నీ
లాంజనరంజితాక్షులు మదాప్త సఖీజను లద్భుతాకృతీ!

పర్వదినంబుగాన నరపాల కుమారిక తల్లి యానతిన్
సర్వశుభప్రదాయినికి శాంకరికిన్ నగరాజకన్య కం

తద్విహితాలయంబున యథావిధి మంగళపూజ సేయఁగా
దూర్వలుపుష్పముల్ చిదిమితోడ్కొనిపోఁజను దెంచె నేడిటుల్.

అని పలికి యవ్వెలందుక
తన నేదో యడుగవచ్చి తద్దయు మఱలన్
మనమున సందేహించినఁ
గనుగొని నరనాథసుతుఁడు కలితాదరుఁడై.

కలికీ! సందియమందె దేల? యడుగంగావచ్చి యట్లైన నీ
తలపోఁతంగనుగొంటి మీ విషయమున్ దథ్యంబు వాకొంటి వా
వల మద్వార్త యెఱుంగఁ గోర్కి గలిగెన్ భావంబులోనై జమీ
యిలనన్యోన్యకథాబుభుత్స తగవా యీమాత్రమాలింపఁగన్.

క్షాత్రతేజితమైన వంశంబుమాది
యస్మదీయాజ్ఞ మగధరాజ్యమునకెల్ల
రత్నమయభూషణంబు మా రాజధాని
పుణ్యచరితంబు పాటలీపుత్ర మబల!

అవని విశ్రుతుఁడైన జయంతసేన
పార్థివేంద్రున కాత్మీయపత్నియందు
నేకపుత్రుండనై జనియించినాఁడ
బుష్పసేనుఁ డటండ్రు నన్ బువ్వుఁబోడి!

అని తనపేరు సెప్పిన నృపాత్మజ చివ్వనలేచి వేణి క్రొ
న్ననలు ధరిత్రిరాల వదనంబున నిద్దపుసిగ్గు దొంతరల్
దొనికిసలాడ సంభ్రమముతో నునుబయ్యెదఁ జక్కఁద్రోయుచున్
జనియె బిఱాన లోపలికిఁ జారుమరాళవధూటికాగతిన్.

ఇక్కరణి లోనికేగుట
లక్కా! తలపోయఁబాడియగునే యనుచున్
జక్కని రదనావళిరుచి
చెక్కిళులందచ్చుపడఁగఁ జెలియలు నవ్వెన్.

వ. అంత వారి మనోహర చేష్టాభావం బనేకవిధంబుల మనంబున వికల్పించియు నిశ్చయింపనేరక తదీయరూప లావణ్య నైపుణ్యంబుల కచ్చెరువొందుచు, భావవికృతి వెలికిఁదోపనీయక మఱలకన్నియతో నా రాసుతుండు

భావజరాజ్యలక్ష్మి! మదభాస్వరమై తనరారునట్టి మా
పావురమొక్కటీదెసకుఁ బర్విడివచ్చెను జొచ్చెనే విహం
గావృతమైన మీ యుపవనాంతరమందున హేమవర్ణ ము
ద్రావలయంబు దానికి విరాజిలు సుందరకంధరంబునన్.

దాని సంగ్రహించు తలఁపున నిటువచ్చి
నాఁడనుమ్మ పోవుజాడబట్టి
యిచటి కరుగుదెంచనే లేకయెటుపోయె
నెఱిఁగియున్నఁ దెలుపు మింతి! యనిన.

అంతటఁ దానుగూడ భవనాంతరసీమకుఁ జేరనేగి, వా
సంతికతోడఁ గొంతవడి సాధువిలాసపరీహసంబులన్
మంతనమాడియాడి మణిమాల యొకానొకపావురంబు, భూ
కాంతకుమారు సన్నిధికిఁ గైకొనివచ్చి యొయారమేర్పడన్.

అవనీనాథతనూజ! చూడు మిదియేనా మీ కపోతంబు, మా
భవనాంతప్రతిబద్ధరత్నవలభీభాగంబునన్ వ్రాలి మం

ద్ర విరావంబొనరించినం గని సఖీరత్నంబు కాంక్షింపగన్
సవినోదంబుగఁ బట్టి తెచ్చి యిపుడే సౌధంబులోఁ బెట్టితిన్.

ముచ్చటఁజెంది మా చెలియ మోహముతోఁగయికొన్న దీని నే
డిచ్చటనుంచు డెల్లి తమ యిష్టసఖున్ గరుణించి పంపినన్
దెచ్చునతండు ముద్దియకుఁ దీఱు నభీష్టము యుష్మదాదృశుల్
మచ్చికఁ బూవుఁ బోండ్లు పెరిమంబునఁగోరినదానిఁ దీర్పరే.

కన్యారత్నముమీఁద నుంపఁదగు మీ కారుణ్యమీమాత్రమో
ధన్యాత్మా! యని బల్కినన్ విని యమందస్మేరపూరంబు సౌ
జన్యశ్రీ వెలయింప రాకొమరుఁ డా చంద్రాస్యతో "దీనికై
యన్యున్ వేడిన యట్లు వేడఁదగునే యారీతిఁ గావింపుడీ."

అని ముదమారఁబల్కి హృదయంబున నీ సుకుమారదేహలన్
గనుగొని వీరి భావములఁ గైకొన మత్ప్రియమిత్రుఁ బంపఁగా
ననువగు మార్గ మియ్యది యటంచుఁ దలంచి తదీయ సౌమ్యచం
దనమృదుమందభాషణవిధంబునకున్ గడు మెచ్చుచున్నెడన్.

బిసరుహనయన యొకర్తుక
మసలక చనుదెంచి యచట మణిమాలికతోఁ
గుసుమాపచయము ముగిసెను
గిసలయశయలార! రండు గృహమున కనిన౯.

కాంతపదాంగదంబులు చొకాటముగా రొదసేయుచుండ వా
సంతిక చంద్రకాంతమయసౌధము వెల్వడి రాజపుత్రు పీ
శాంతికమందు నొక్క సుమహారముఁ గానుక వెట్టి శర్వరీ
కాంతసమానమౌ నగుమొగంబును గొంచెమువాంచి సిగ్గునన్.

శాంతమనోహరంబయిన సారసగంధి శరీరభాగ మా
ద్యంతముఁ బాఱఁజూచి వసుధాధిపనందనుఁ డా రతీశలా
లాంత శిలీముఖంబుల నిరంతరమౌ నెఱదాడికగ్గమై
యెంతయుఁగొంతసేపు సకలేంద్రియచర్యలు దక్కి మ్రాన్పడెన్.

ఆ నిడువాలుఁగన్నులు తిలాకృతి నొప్పు తదీయనాస పూ
సోనలఁ జిమ్ము నాకలికి సుందరమౌ శుభదంతరాజి ని
ద్దానెఱిమించు వేణి సునితంబగు నెన్నడు మబ్జపత్రముల్
బోని తదంఘ్రులున్ భువిని ముగ్ధులఁ జేయవె యెట్టివారలన్.

ఓ రాజాన్వయసింధుకౌస్తుభమణీ! యుష్మద్విహాంగంబుఁదాఁ
జేరంబట్టిన దోషనిష్కృతికి మాసింధుక్షమానాథు మే
ల్గారాబంబుల కూఁతు రియ్యది యొసంగన్ వచ్చె నీ మల్లికా
హారోపాయనమున్ గ్రహించి కరుణాయత్తుండవై బ్రోవవే.

అనిమణిమాలసాగె నటులాతరలాక్షి పిఱుంద నేగుచున్
జనవరపుత్రి భూపకులచంద్రునిఁ బల్మఱుమోముఁద్రిప్పి క
న్గొనమదినెంచెఁగాని సమకూడకపోయెనుగోర్కి మేదినిన్
ఘనమగులజ్జ యార్యకులకన్యలకున్ దురతిక్రమం బఁకన్.

ఉదయధరాధరేంద్రమున నుజ్జ్వలరీతిజనించి ప్రౌఢమై
చదలను కాననంబుఁ దన చండమయూఖశిఖాళి నేర్చుచున్
గడలిన మూడుమూర్తుల యఖండ జగద్ధితమైన తేజ మ
య్యదనున నాఱిపోయె నపరాంబుధిఁజేరి జలావసిక్తమై.

తనరు విజ్ఞానకోశవిత్తము హరింప
నాత్మఁగోరి నిద్రాదేవి యఖిలజనుల

మూర్ఛపడఁజల్లు వెడమచ్చుపొడియనంగ
నంధకారంబు గ్రమ్మె రోదోంతరమున.

సంధ్యానటన వేళ జాఱిప్రోవులువడ్డ
కాలకంఠుని కాలిగజ్జెలనఁగ
వేల్పురాయనివీటి విఫణివీథులలోన
నిలిపిన మణిదీపకళికలనఁగ
యామినీసోమకల్యాణంబునకునైన
చాందినీముత్యాలసరులనంగ
వెల్లటేనుఁగుకొమ్ము వ్రేటువాటులచేత
రాలిన తెలిచెట్టు పూలనంగ

కాలనాడింధముఁడు చంద్రకనకగుళికఁ
గాచనూఁదిన యంగారకణములనఁగఁ
గ్రమముమీఱంగఁ దారకాసముదయంబు
మినుకుమినుకంచుఁ గనుపట్టె మింటనపుడు.

కలువజవరాలితోఁ బొలయలుకఁబూని
కానరాకుండ డాఁగిన గౌరభానుఁ
డంబరాలేఖపూర్వశైలంబునెక్కి
మవ్వ మెసఁగంగ నపుడొక్కనవ్వునవ్వె.

వెన్నెలవెల్లువల్ బఱచె విశ్వజగద్వలయంబునందుఁ జం
చన్నవమల్లికాకుసుమసౌమ్యపరాగభరాలసంబులై
సన్నని గాడుపుల్ విసరసాగెను హర్షమయప్రపంచమం
దున్నతపీఠమెక్కి నిఖిలోర్వి విహారముసల్పె నత్తఱిన్.

ఆ సుమచంద్రికావిమలమైన నిశాముఖకాలమందు స్వా
వాసముఁజేరి గంధహిమవారి మునింగి మడుంగుగట్టి పూ
జాసుమహస్తలై చెలులు చక్కటిరా జననాథపుత్రి దే
వీ సదనంబులోనికి నివేశితభక్తివినీతయై చనెన్.

చని గారుత్మతవేదిక
ననువగు పుష్పప్రవేణి నమరిచి దేవిన్
వినతలయి నిలిపి యావా
హనమొనరంజేసి ముగుద లభినవఫణితిన్.

మంగళగౌరి! కావ్యనగమందిరవాసిని! బాలికా వయం
సంగతయా కృపామధురసౌమ్యదృశా పరిపాలయస్వ పూ
జాం గుడమిశ్రితాం కలితచందనపూగలతాదళాం గృహా
ణేంగితసిద్ధయే భవ మహేశ్వరి! యంచు నుతించి రందఱున్.

పూజావసానమున నా
రాజాస్యలు పసిఁడిపళ్ళెరంబులతో రా
రాజన్మౌక్తికమణినీ
రాజనముల నిచ్చి రచలరాజాత్మజకున్.

బిసరుహదళాయతాక్షులు కుసుమకోమ
లంబులైనట్టి నిజదేహలతలువంచి
తలఁపులందున్న కోర్కులఁ దెలియఁబలికి
మోడ్పుగేలించి వరుసగా మ్రొక్కిరపుడు.

నిరపాయస్థితి నొందులోకములు నీ నిత్యానుకంపన్ మహే
శ్వరివంచున్నుతియించు వేదచయ మైశ్వర్యాయురారోగ్యముల్

స్థిరచిత్తంబునఁ గొల్చువారల కిలం జేకూర్తువోయమ్మ! నీ
చరణాబ్జంబుల భక్తి మాకొసఁగవే చండీ! దయాంభోనిధీ.

అని రాజపుత్రి మ్రొక్కిన
విని మణిమాలిక యిదేమి వెలఁదీ! హృదయం
బునఁ గల కోర్కి వచింపక
వినిపింతువు లేనిపోని బెడదలివేలా.

సిగ్గుచే నీవు బయటికిఁ జెప్పకున్న
విన్నవించెదలెమ్ము నీకున్నవాంఛ,
దేవికని మందహాసంపుదీప్తులలమి
గండభాగంబులందు రేయెండగాయ.

వినతులొనరించి యొకమాటవిన్నవింతు
నేఁడు వనవాటిలోనఁ గన్పించినట్టి
మగధరాజన్యు మాచెలి మగనిగాఁగఁ
గరుణసమకూర్పవమ్మ ముక్కంటికొమ్మ!

అని వచియించినన్ జెలువలందఱు నవ్విరి రాజపుత్రి "నీ
మనమున నున్నవాంఛయిది మానిని నాపయిఁ బూసెదేలకో,
యని తలవాంచె, నట్టిసమయంబుననే నగజాతఁజూడఁగాఁ
బనిగొనివచ్చు భూరమణపత్నికి వీనులసోకె నింతయున్.

రాజసతింగనుంగొని బిడాన మిథఃపరిహాసమాపిక
న్యాజనమెల్లఁగిమ్మనక యట్లెనిలంబడె నంతలోన నా
రాజముఖీలలామ మగరాజకుమారికి మ్రొక్కి "శారదాం
భోజదళాక్షులార! నృపపుంగవుఁడెవ్వఁడు వచ్చెఁదోఁటకున్

PADYALA PADMA

ఎక్కడనుండి తానెటకునేగుచు నేమికతానవచ్చె మీ
చక్కటి కానరేంద్రవరు శాసనరక్షకు మాళివంచి పెం
పెక్కడిరాజ్యమేది ? కలదే కమనీయత వానిరూపులో
నిక్కముచెప్పుడమ్మ హారిణీతరళేక్షణ లింతదాపకే.

నావుడు మణిమాలిక యిం
కేవిధమునఁ దప్పుకొనఁగ నెసఁగదటంచున్
భావించి సింధునాయకు
దేవేరికి విషయమెల్లఁ దెలియంబరచెన్.

కనుదమ్ముల్ సఫలంబుగా మగధభూకాంతుండు గన్పించి క
మ్మని మందారమరందముల్ జిలికి సంభాషించుటల్ మున్నుగా
వినిపింపం దలయూఁచి రాజసతి సంప్రీతిన్ దనూజాతతోఁ
జనియెన్ వైద్యుతచిత్రదీపకళికాంచత్కుడ్యమా మేడకున్.

వ. అంత నిచ్చట.

ఆ చిగురాకుఁబోండ్లు సనినంతట మన్మథతీవ్రపుష్పనా
రాచపరంపరల్ కలవరంబొనరింపఁగ సైప కచ్చటన్
లేచి నరేంద్రసూనుఁడు చలించిన డెందముతోఁ దదంగనా
లోచనమగ్నుఁడయ్యు నెటులో కదలెన్ బ్రియమిత్రు నింటికిన్.

కొంతదూరమేగునంతకుఁ జెలికాఁడు
మదిగలంతతోడ నెదురువచ్చి
పాడు పావురంబు పఱచినఁ బఱచెఁ బో
యింతతడవుసేయ నేలనీవు.

చండమయూఖుఁ డస్తగిరి సానుతలంబున నిద్రఁజెందె భూ
మండలమెల్ల చిక్కనితమంబులచేఁ బరిభూతిఁ గాంచె ను
ద్దండపిశాచదీర్ఘనినదంబులు సాగెడి నింతసేపు నీ
వుండఁగ నేమికారణమొకో యని డెందము గుందె మిత్రమా.

నావిని పుష్పసేనుఁ డెలనవ్వు మొగంబునదోపఁ బావురం
బావిధిబాలఁ బట్టుకొను నాసఁజరించితిఁ గొంతదన్క నే
లా వగపింతమాత్రమునకంచు వచించెనుగాని చూడఁగా
భావమునందు నేదో పెనువంతఁగలంగు తెఱంగు గన్పడెన్.

ఇద్దఱునుగూడి యింటికినేగి వేఁడి
నీట స్నానంబొనర్చి సాపాటుసేయఁ
బోయి రచ్చోట జనవరపుత్రకునకు
విమలరసభోజ్యములు ఘోరవిషములయ్యె.

భోజనములైనవెన్కఁ దాంబూలచర్వ
ణంబుగావించి రత్నసౌధంబుమీఁద
రాజహంసచ్ఛదాపాండరంబులైన
మృదులతల్పంబులందు నిద్రింపఁజనిరి.

గగనకాసార మధ్యభాగమున నపుడు
చలువలీనెడి నక్షత్రజలజవాటి
హాళి విహరించు మదరాజహంస మనఁగ
మొనసి చూపట్టెఁ గలువల ముద్దుమగఁడు.

నిద్దురఁగూరియున్న మగనింగని చందనధూళి మేనిపై
నద్ది సితప్రసూనముల నొఁదలఁదాలిచి ధౌతవస్త్రమై

ముద్దియ యెవ్వతో విటుని మోసలకుంజనుచుండెగాని పే
రెద్దియొ నిశ్చయించి వచియింపఁగరాదు లయించె వెన్నెలన్.

ఆ నడురేయి వేళ నగరాంతరమందలి పుష్పవాటిలో
సూనశరాసనప్రతిమసుందరుఁ డొక్కఁడు చూతపోతసం
తానము నీడలందొదిగి తక్కుచుఁ దారుచువచ్చిదూరె ని
మ్మైన లతానికుంజమున నచ్చట నెవ్వరు వేచియుండిరో.

ఇందుశిలానిబద్ధమయి, యింపగు సౌధముమీఁదఁజేరి యిం
దిందిరవేణి నొక్కయువతిన్ బలురీతుల వేఁడుచుండె సం
క్రందనసూను సన్నిభుఁ డొకానొక ప్రాయపువన్నెలాఁడిఁకన్
జందనగంధి నెమ్మనము శాంతివహించెనొ లేదొ నాటికిన్.

మానినియొర్తు తెల్లనిసుమాళపుఁ బైఁట ముసుంగువైచి దీ
నాననయై తటాకతటమందలి పూఁబొదరిండ్లలోఁ దృణం
బైనఁ జలించినంత నడియాస దెసల్ పరికించుచుండె, నా
మీనమనోహరాక్షి నటుమేల్పడి యెవ్వఁడు మోసగించెనో.

వ. అట్లు జగదానందంబులై యిందుబింబంబునుండి వెడలి ప్రవహించు నక్కౌముదీపూరంబులందు మునింగి జంతుకోటి సుఖించుచుండె నట్టియెడఁ బుష్పసేనుండు.

పండువెన్నెలతోడ నిండిన వినువీధిఁ
    బరికించి తేపతేపకును బొరలుఁ
జివ్వనలేచి వీక్షించి నల్మూలల
    నుసురంచు వేఁడినిట్టూర్పువుచ్చుఁ

దల్పంబుడిగి కొంతతడవు తానిటునటు
సంచరించుచును భాషించునేదో
బిరబిర పైనుండి ధరణికి దిగివచ్చి
యాక్షణంబున మీఁది కరుగుమఱల

నిద్దురారాదు కంటికిఁ, బ్రొద్దుపోదు
కాంక్షితంబైన వస్తువు కానఁబడదు
కటకటా! మీనకేతనగాఢవహ్ని
తప్తుఁడై పెక్కురీతులఁ దటమటించె.

నాలుగు జాములుగలిగిన
కాలంబొక బ్రహ్మయుగము కైవడి ధరణీ
పాలకుమారుఁడు త్రోసెను
బాలామణిమీఁద వలపు బ్రబలిన కతనన్.

మానుగదాడివచ్చె సతమావులవాఁడదెయంచుఁ దారకా
సేనలఁ గూడబెట్టుకొని చెచ్చెరఁబాఱుచు నున్న యాసుధా
భానుని దండనాథుఁడనఁ బ్రాగ్గిరికూటవిటంకభూమిపై
గానఁగవచ్చె నప్పుడొౘకంబున వేగురుఁజుక్కదీప్తమై.

మలయమహీధరాగ్రవనమండలిలో జనియించి పాండ్యభూ
నిలయములందుఁ జొక్కు నళినీమృదువేణులగబ్బిగుబ్బలన్
దొలఁగు పటీరగంధములదోఁగి జగద్వలయంబు మెచ్చగా
నలసవిహారముల్ సలిపెనంతఁ బ్రశాంతనిశాంతవాయువుల్.

వేకువ యలంతి వలిగాలిసోకువలన
మేల్కని మధురాలాపుఁడు మిత్రవరుని

సెజ్జకడకేగి యతని వీక్షించి పిలిచి
మెల్లమెల్లన మాటల మెలపుదోప.

నిద్దపుఁ జెక్కులన్నయననీరము గీరలుకట్టెఁ గన్దెలల్
నిద్దురలేక యుబ్బినవి లేచి యథావిధిపూర్వమట్లు నేఁ
డెద్దియు ముచ్చటింపవదియేమొ విచారముసేయ నేదియో
పెద్దకలంత నీ హృదయపీఠిఁ దగుల్కొనెనంచు నెంచితిన్.

చిత్తమగల్చు నీ కటికిచింత ముసుంగునఁబెట్టి యీ విధిన్
దత్తరమంద నేటికిఁకఁ దాఁచక నిక్కముఁ జెప్పుమేను గ్రొం
గ్రొత్తనుగానునీకు పలుకుల్ వెలిబుచ్చగ, మిత్రమానసా
యత్తముసేయరాని విషయం బొకడున్నదె యార్యవంశజా!

అనిన విని పుష్పసేనుఁ డాననమువాంచి
వేఁడి నిట్టూర్పు వెడలించి ప్రియుఁడవైన
నీకువచియింప కేరీతినిలుతు వినుము
గతదినంబున జరిగిన గాథయనుచు.

కలరవపోతమేగుటయుఁ గైరవపత్రదళాక్షులున్న యా
వలపుపిసాళితోఁటనడువంకకుఁ దాఁజని యందుసింధుభూ
తిలకుని కన్యకామణులఁదేటపడన్ గనుగొంట, వారితో
సలిపిన వాక్ప్రసంగములు, సర్వముఁదెల్పి విషాదతప్తుఁడై.

చాటింకేటికిఁదెల్పెదన్ బ్రియవయస్యా! సింధురాజేంద్రు రా
వీటంబుట్టినకల్పవల్లి తొడిమన్ విప్పారు పొందమ్మి నా
నాటన్ నిగ్గులుదేరు చంద్రకళ యా నాళీకపత్రాక్షి నా
పాటీరప్రతిలిప్తదేహననుగూర్పంజూడుమేలా నుడుల్,

చెప్పెద నీకు వేఱొక విశేషము నావిషయంబు సర్వమున్
విప్పివచించినంతఁ గడు వేగిరపాటెలయంగ లేచి యా
కప్పురగంధి మేనఁ బులకల్ జిగురింపఁగ లోనికేగె న
ట్లప్పువుఁబోఁడి వోవుటకు నాశయమేమొ యెఱుంగ రాదటన్.

అనవుడు మిత్రుఁడిట్లను నహో తగుసంఘటనంబు గల్గెఁ నే
గనుగొనినాఁడ నామె నొకకాలమునందు, యదృచ్ఛగా సతీ
జనములకెల్ల మిన్నయని చాటివచింపఁగవచ్చు నీమనం
బనువగుతావునం దగిలెనంచు గడున్ ముదమయ్యె నాత్మలోన్.

ఏటికి దీనికై వగవ నీవిధి నో మహినాథచంద్ర ! నీ
గీటుపసిండివన్నె తులకింపులరూపముఁ గాంచినట్టి యే
పాటలగంధినైనఁ దన వాఁడికటారులచారుఁజూపి ము
ప్పూటలలోన మీటుఁదనమున్ సడలించి మరుండు వంపడే.

మునుపొకవార్త వింటి జనమోహన ! "మాగధపుష్పసేనుఁడే
గొనములదిట్ట యాతనికిఁ గూఁతునొసంగుదుమంచుఁ దత్సతీ
జననియు సింధురాజు బలుసారులు పల్కిరటం"చు దానిచే
వనిత దొలంగె నీ విషయవాస్తవమున్ వివరింప సిగ్గుచే.

ఓ సుకుమారరూపసుగుణోత్తమ ! సంతత మింద్రవైభవో
ద్భాసికి నీకు నేల వనితామణిపొందున కీ మహత్తరా
యాసము, కాకితోడఁ గబురంపినఁ గన్నులకద్దుకొంచు రా
డే సిరులిచ్చి నీకొసఁగడే తనయామణి సైంధవుండిలన్.

ఐన నచటికిఁ గలరవవ్యాజమునను
బోయి గొనివత్తు నా పువుఁబోఁడి భావ

మారసి యటంచు వేగకాల్యములఁదీర్చి
యరిగె నాతఁడు నాఁటిమధ్యాహ్నవేళ.

వ. అట్టితఱి నేమియుందోఁపక యమ్మగధరాజన్యకుమారకుండు చంద్రశాలపై హంసతూలికాతల్పంబునఁ బరుండి యిందుశిలామయంబులగు భిత్తిభాగంబులఁ గీలింపఁబడి యున్న హస్తవద్రచితమనోహరచిత్రపటంబుల నెన్నుచు వినోదింపఁజొచ్చెనందు.

జిలుఁగు పసిండిమంచమునఁజేరి రొయ్యారముదోఁపగన్ రతీ
జలజదళాయతాక్షికి విశాలనిటాలమునందు ముస్సుగాఁ
దిలకముఁదిద్దు నా మదనదేవునిఁ జూచి దురంతవేదనా
దలిత మనస్కుఁడై వదనతామరసం బటుద్రిప్పె దిగ్గనన్.

దంతిసమానయానలగు తాపసకన్యలు గొల్వ మాలినీ
ప్రాంతమునందుఁ బుష్పిత కురంటకమంటపమధ్యభూమిలోఁ
గంతుశిలీముఖవ్యథలఁగ్రాఁగు శకుంతలఁ బాఱఁజూచి "దు
ష్యంతమహీంద్రుఁడింతకుమహాసుకృతాత్ముఁడుగాఁడొకో యనెన్.

అంబురుహాంబకప్రతిముఁడౌ నిషధేంద్రుని రాజ్యభోగ రూ
పంబుల రీతులెల్ల నల భైష్మికుఱంగటమాటతీరు తీ
యంబులు దోఁపఁబల్కి హృదయంబున రాగమునాటుచున్న కా
దంబ కులావతంసము విదగ్ధతకున్ గడుమెచ్చె నాత్మలో.

ఈ విధంబునఁ గొంతసేపెలమిఁజూచి
యంతకంతకు నగ్గలంబైన విరహ
తాపభరమున మేనెల్ల తటమటింపఁ
గన్నుగవమోడ్చి మౌనసంగతిఁ బరుండె.

ఆపగిది నేఁగి మధురా
లాపుఁడు ప్రమదావనస్థలంబునఁ దరుణీ
ప్రాపితసందేశముఁగొని
మాపటివేళకును జేరె మందిరమునకున్.

హితుఁడు రాఁ గనుఁగొని కుతుకంబు రెట్టింప
నాత్రపడుచు రాజపుత్రుఁ డప్పు
డేమిజరిగె నచటివృత్తాంతమంతయు
నాకళించి చెప్పుమన్న నతఁడు.

ఆగతినేఁగి నేనుమృదులానిలసంగతి నూఁగులాడు పూఁ
దీఁగెలమీఁదనుండి పరతెంచు సువాసనచే సమీప భూ
భాగములెల్లఁజుట్టువడ భాసిలు నావనసీమఁజొచ్చి పు
న్నాగమహీజమధ్యమున నవ్యతరం బొకమేడఁజూచితిన్.

అందసమానరూపపరిహాసవచోరచనాంచితల్ చెలుల్
గొందఱుజేరి నీకుసుమకోమల దేహవిలాసమున్ భవ
న్మందమనోహరాలపనమాధురియున్ గణియించుచుండ నా
నందమునొంది యింకను వినంగనటుల్ నిలుచుంటి బైటనే.

ఆలోపల నొక మత్తమ
రాళాంచితయాన బాహిరంబునకును దాం
బూలోచ్ఛిష్టము నుమియఁగ
హేలాగతి మెఱయవచ్చి వీక్షించె ననున్.

కనుఁగొని వేగమ చెలులకుఁ
గనుసన్న యొనర్చినంతఁ గలకల మడఁగెన్

గుసగుసలు సాగె లోనికిఁ
జనినాడను వారలపుడు సంభ్రమమెసఁగన్.

గొనబు పింగాణిపీట నాకొఱకు వేయఁ
బోయి మెల్లనఁగూర్చుండి పొలఁతులార!
ఎవ్వరోయంచు మదిలోన నెంచవలదు
పుష్పసేనున కేనొక ముఖ్యసఖుఁడ.

మాచెలువుండు నిన్న మునిమాపున మీకడనుంచెఁగాదె లీ
లోచితమైన పావురము నొండతఁడే గొని తెమ్మటంచుఁ బ్రే
రేఁచెను నేఁడు నన్గనికరించి యొసంగినఁ బోదునన్న వా
చాచతురప్రచార యొక చందనగంధి వచించె నాకిటుల్.

పోవుటకునేమిలెమ్ము మీ పుష్పసేన
నరవరాఖండలుని లక్షణంబులెల్ల
నెన్నదగినవియేగాని హృదయమొకటి
బిఱుసు పాకంబుగాఁగ భావింతుమయ్య.

కాకపోయిన తనమీఁద గాఢమైన
హాళి గైకొని మరుని సాయకములకుఁ
గ్రాఁగిపోయెడు నలివేణిఁ గదియకెవఁడు
క్షితి నుపేక్షింపఁగలఁడో వచింపుమయ్య.

అంతట నే గ్రహించి వనితా! యిఁక నాపుము మా సఖుండె మీ
కంతకఠోరమానసునియట్లు గనంబడె గాని వాని లా
వంతయుగీటుఁవుచ్చి విరహాగ్నులలోఁబడఁద్రోసి చూచువా
రెంతటి వారలో యెఱుఁగరేమిది చెప్పుమటన్న నామెయున్.

పకపకనవ్వి మీ మగధపార్థివవర్యునకేల తావ మా
సకలకళావిభూత్తముని సమ్మతిఁ గాదనువార లెవ్వ రీ
చకితమృగాక్షి సింధునృపచంద్రునికూఁతురు మీ నరేంద్ర పు
త్రకునిపయిన్ విరాళిగొని తద్దయు డస్సెను జూడుమో సఖా.

కన్నియ నిన్న రాకొమరుఁ గాంచినదాదిగ నన్నమేమియున్
దిన్న తెఱంగు కన్బడదు నిద్దురవోవదు మాటలాడ దే
మెన్నివిధాలఁజెప్పిన సరే యనదక్కట రాజపుత్త్రుఁ డి
ట్లున్న త్రిలోకసుందరి నహో గమనింపకయుండు టొప్పునే.

అన విని నే నమ్మగువకు
వనజాక్షీ! హితునిబాధ వర్ణించుటకే
యనువుపడదతని మానస
మును గొనియెన్ మీనరేంద్ర పుత్త్రిక యెపుడో.

వినుమొకమాట మా మగధవీరవరేణ్యునిఁ గర్కశాత్మకుం
డనఁ బనిలేదు మీసకియయందును దోషములేదుగాని యీ
యనుగుణరూపయౌవనుల నారసియిప్పటిదాఁకనిట్లు సొం
పెనయఁగఁగూర్పకున్న మనయిద్దఱి దీ యపరాధ మింతిరో.

సతి! మీ రాజకుమారిక
పతికిన్ సందేశమొండు బంపుట మే లా
గతినొసగింపు మనఁగ భూ
పతిసుత చిఱునవ్వుతోడ వదనమువాంచెన్.

భర్తృదారిక మొగమటు పాఱఁజూచి
తిరిగి నాతోడననియె నాతరుణి యిట్లు

తొలఁకుసిబ్బితిచేత నీతోడ నేఁడు
చెప్పఁగలదానికంటె మీ చెలువునకును.

నిన్నటివేళ మాకలికి నేరుపుమీఱ నొసంగినట్టి యా
క్రొన్ననదండ వాచికముఁ గోమలరీతి వచింపఁజాలు లె
మ్మన్న సరే యిఁకన్ సెలవటంచు ముదంబునలేచి వచ్చినా
డన్ననఁబోఁడి యిచ్చిన మిటారపుఁబూసరమేది చూడుమా.

అనిమిత్రుండెఱిఁగింప రాకొమరుఁ డత్యానందమున్ బొంది చ
క్కనినెత్తావుల పూవుటెత్తుఁ దన చొక్కామడ్పులోనుండి తీ
సి నిదానంబుగ విప్పిచూడఁ గనిపించెన్ బత్రమొండందు ది
ద్దిన ముత్యాలమెఱుంగుచాల్కరణి నుద్దీపించు వర్ణాళితో.

నహి ఖలు సుకుమారపుష్పవల్లీం
త్యజతి కదాపి వినారసానుభూతిం
మదమధుపకుమారక స్సుఖజ్ఞః
పరిచయమాత్ర వినోదితాంతరాత్మా.

అని వ్రాసియున్నఁ గనుఁగొని
వనితల రచనావిదగ్ధ వైఖరినెల్లన్
గొనియాడు చుండి రిర్వురు
తనరెడి కుతుకమున నట్టితఱి నచ్చటికిన్.

సింధునాథునాజ్ఞచే వచ్చెఁదన్మంత్రి
చంద్రముండు బుద్ధిసాగరుండు
అతని నారసి మధురాలాపుఁ డొకయుత్త
మాసనంబుఁ దెచ్చి యచట వైచి.

"చాల విశేషమో సచివసత్తమ ర"మ్మని గౌరవించి భూ
పాలకుమారుతో నతని పద్ధతియున్ విషయంబుఁజెప్పి యా
పోలిక మంత్రివర్యునకు భూవరపుత్త్రు చరిత్రమంతయున్
దేలిచివైచి యిర్వురను దింపెఁ బరస్పరభాషణంబులన్.

మీ మహీనాథునకు క్షేమమేయటంచుఁ
బుష్పసేనుండు వల్కిన బుద్ధిసాగ
రుండు మదిలోన హర్షంబు మెండుకొనఁగ
మెలపు దోలుకాడ సమ్మతిఁ దెలియఁబఱచి.

రాజకులవర్య! రాతిరి రాజమహిషి
వలన మీరాక నెఱిఁగి మాపార్థివుండు
కోరి ననుబంప నిచటికిఁ జేరినాఁడ
గనులపండువుగాగ నిన్గాంచినాఁడ.

మీవంటి యుత్తమ క్షాత్రవంశసంభూతులతోడఁ బరిచయంబు గలుగుటఁజేసి నేఁడు సుదినంబు. మీ మధుర సౌహార్ద పూర్వకంబులైన యుచితసంభాషణంబులకు నాడెందంబమందానందంబునొందె. నదియట్లుండె, మా సింధు వసుంధరావల్లభుండు ముందు మీవృద్ధరాజు ననామయంబడిగి తన మాటలుగా మీతో విన్నవింపుమని పుత్తెంచిన సందేశంబొండు గల దవధరింపుము.

ఉత్తమరాజవంశకలశోదధిచంద్రమ! మిమ్ముబోటి భూ
భృత్తులు మాస్థలంబునకుఁ బ్రేమదలిర్పఁగవచ్చు టస్మదా

యత్తపురాతపఃఫలమటంచు భవిష్యదమోఘభాగ్యసం
పత్తికిఁ గారణంబనుచు మానసమందుఁ బ్రమోదమొందితిన్.

అఖిల గుణనిధివంచు నీయశమువింటి
నవనినార్జింపఁదగినది యదియెసుమ్ము
భోగభాగ్యంబులన్నియు బుద్బుదములు
స్థిరతమంబైన దొక్క కీర్తియె మహీంద్ర.

వెఱవక మానవంతులగు వీరనరేంద్రులు వేఱుచోటఁ బెం
పఱి యొకదానికై కడఁగి యాచనసేయరటన్నవార్త నీ
వెఱుఁగుదువైనఁగాని యవనీశ్వర! ప్రేమభరంబుచేత నే
నెఱబఱికంబులే కడుగనెంచితి నిన్నొకదాని నేటికిన్.

కంతునిచేతి బాణమనఁగా నలరారు సురూపశీల వా
సంతిక నాఁదనర్చు మృగశాబక చంచలదంచితాక్షి నా
సొంత కుమార్తె దాని నరిసూదన! నీకొసఁగంగనెంచి మా
మంతిరిఁబంపినాఁడ ననుమానములేక గ్రహింపు కన్నియన్.

ఆర్యనుతమైన వంశంబునందుఁబుట్టి
పరువముననున్న మందారవల్లి యనఁగ
మించు కన్నియఁగూడి సుఖించుమనుచుఁ
గోరితిమి గాని చేదు మ్రింగుమనలేదు.

చిత్తజరూప! సాధుజనశీలమెఱింగిన మిమ్ముబోటి ధీ
రోత్తము లెన్నడైన మదినొప్పరికింపరుగాదె పెద్దవా
రిత్తివచించినట్టిదని యెంచి మదీయునిఁ బంపినాఁడఁ బ్ర
త్యుత్తరమున్ వినంగఁ గడునువ్విళులూరుచునుండెడెందమున్.

అని యిట్లు సింధుజనపతి
వినిపింపఁగవలయునన్న వృత్తాంతంబున్
వినయమెనయంగఁజెప్పిన
ననుపమసంతోషవికసితాంతర్యుండై.

మాగధపుష్పసేనుఁ డను మంత్రికులాభరణంబ! తప్పకే
లాగుననైన మీ నృపలలాముని కూఁతువరింతు నుజ్జ్వల
శ్రీగుణమైన కన్నియను జేకొనుమిత్తుమటంచుఁ జెంతకున్
తా గమనింప కూరకతిరస్కరణంబొనరించు టొప్పునే.

ఐనఁ దండ్రిగారి యనుమతిలేకుండ
సంప్రతింపఁదగదు సచివవర్య!
వారితోడఁగూడి భాషింపు మచ్చటఁ
జక్కనగును గార్యసరణియెల్ల.

నేటి నిశాంతవేళఁ బయనించెదమా పురికట్లుగాన నీ
నాటికిఁబోయి సింధుజననాథునకీ విషయంబు సర్వమున్
దేటపడంగఁ జెప్పి యరుదెమ్మతఁ డానతియిచ్చెనేని మా
వీటికి నన్నుఁ జిత్తమని వెళ్లెను మంత్రివరుండు పిమ్మటన్.

వేగుజామున మేల్కాంచి వేగజనిరి
మిత్రులిర్వురు పాటలీపుత్రమునకు
సింధునరనాథు ననుమతిజేసి తత్ప్ర
ధానవర్యుఁడు నచటికే తరలిపోయె.

అచటఁ బుత్రునిఁజూచి జయంతసేన
పార్థివేంద్రుఁడు నాతని పట్టమహిషి

పట్టగారాని సంతోషభరముగాంచి
రావిధమునఁ గొన్నిదినంబులరిగినంత.

సమయమునుజూచి యాబుద్ధిసాగరుండు
మగధవృద్ధునితో సింధుమండలేంద్రు
నభిమతంబు నెఱింగించి యట్లు పుష్ప
సేను ననుమతిఁ దెలుప నాపైన నతఁడు.

అంచితరీతి నెల్ల సచివాగ్రణులన్ బిలిపించి తేఁడు పం
పించిన మేలివార్త వినిపించి సతీతిలకంబుతో విచా
రించి "శుభస్య శీఘ్రు" మొనరింపవెయంచును వారలొప్పఁగా
మంచిదటంచు సింధునృపమంత్రిని బిల్వఁగ బంచి వానితోన్.

అంతటి రాజవంశమణి యాత్మజనీయఁగ నెంచి మంతరిన్
కింతకుఁబంపఁ గాదనఁగఁ జెల్లునెనాకుఁ దథాస్తు పెండ్లి కా
వింతము వేగిరంబ యని వేద విదగ్రణులైన వృద్ధ కా
ర్తాంతిక ముఖ్యులన్ బిలిచి తక్షణమే శుభలగ్నమెన్నినన్.

ఆవెనుక బుద్ధిసాగరుం డరిగి సింధు
ధరణికాంతునితోడ వృత్తాంతమెల్లఁ
దెలుప నాతఁడు హర్షించి సలుపుచుండె
నడరి యుద్వాహయత్నంబు లంతనిచట.

సౌరభంబులు రేఁగ సకల మార్గములందుఁ
జందన కర్పూరజలముఁజల్లి
పంక్తులై కనుపట్టు భవనాంగణములందుఁ
గనకరంభాస్తంభగణమునాటి

మహనీయమణిమయమంటపంబులలోన
బాలమందారముల్ వ్రేలఁగట్టి
రమణీయ వైఖరి రచ్చపట్టులయందు
ముత్తెంపుటిసుకతో మ్రుగ్గువెట్టి

గోపురములందు నపరంజికుండలెత్తి
నాల్గుదిక్కులఁ బూఁదోరణములుగట్టి
చిత్రమగురీతిఁ బాటలీపుత్రనగరిఁ
గడఁగి కైసేసిరపుడు మాగధునియాజ్ఞ.

తూర్యరవముల వినువీదితూటువడఁగ
నొక్క శుభలగ్నమందున నుచితమంత్రి
బంధుసంతానములు గొల్వ బయలుదేఱి
పుష్పసేనుండు సింధురాట్పురికి నరిగె.

ఎదురుగవచ్చి సింధుధరణీశ్వరుఁ డాతని నర్హరీతిగా
సదమలమైన యొక్క మణిసౌధమునన్ విడియింపఁజేసి స
మ్మదమొనగూర్చె బంధుజనమండలికా పురమొప్పెనెంతయున్
మదవదరాళకుంతలల మందగతాగత సంభ్రమంబులన్.

మఱియు నప్పురంబు

ఎందును వాద్య నిస్వనము లెందును జిత్రకళావినోదముల్
ఎందును వాజిహేషణము లెందును గంధగజేంద్రఘీంకృతుల్
ఎందును జందనాగురుసమిద్ధపరీమళముల్ చెలంగ సం
క్రందను రాజధానికి బరాబరియయ్యె నుదారశోభచేన్.

అంతట శుభలగ్నంబది
యంతికమున కేగుదెంచెననిబుధులాడన్
గాంతలు మాగధకాంతుని
నెంతయుఁ గై సేసి రఖిలహేలాగతులన్.

చలువ పన్నీటిలో స్నానంబుగావించి
పైటాణి కుఱుజరీ పట్టుగట్టి
మృగనాభి తిలకంబు సొగసుగాఁగీలించి
పూవుదండలు మేనఁబోహణించి
కలికికమ్మలచేలు వలెవాటు సవరించి
గొనబునిద్దాసోగకురులుదువ్వి
యాణిముత్తెపుఁబేరు లురుదార ధరియించి
చందన ఘనసారచర్చలలఁది

క్రొత్తగాఁ బెండ్లికొమరుఁడై యుత్తమాప్తు
లెల్ల గొలువంగ శిబికపైనెక్కి నగరి
రాజవీధిని వెడలె దూర్యస్వనంబు
సెలఁగి మినుముట్టగాఁ బుష్పసేనవిభుఁడు.

అక్కా! చక్కనిచక్కయంట విభవంబబ్బో! బలేదంట యీ
ప్రక్కన్ లేఁడఁట యింతరాజు బహుదర్పంబంట మేళాలిఁకన్
తెక్కేలేవఁట చూడరారె యనుచున్ బెంపారు నుత్కంఠతోఁ
చక్కన్వచ్చిరి యమ్మలక్కలు పురిన్ ఝమ్మానాధు వీక్షింపగన్.

మనరాజపుత్రికి ననువుగా సరిపోమెఁ
దగునీతఁ డనిపల్కెఁ దరుణియొకతె

కులమహారాజులుగాదె వారికినేమి
లెమ్మంచు హర్షించె లేమయొకతె
గొప్పవారికినేల కొలఁదివారరుదెంతు
రెండైన ననిపల్కె నింతియొకతె
నుందరుండేకాక సుగుణాలకుప్పగాఁ
గనుపట్టెననియొప్పెఁ గలికియొకతె

పెండిలి యటన్న నీరీతి నుండవలదె
తగిన సంబంధ మనెనొక్క చిగురుఁబోఁడి
యుత్తమాన్వయ సంజాత లువిదలెల్లఁ
జేరి తమలోన నీగతిఁ జెప్పుకొనిరి.

ఎంతగానో చెప్పిరింతేన చివరకుఁ
దుస్సుమన్నదటంచుఁ దొలఁగె నొకతె
పైపసారమెకాని పనిసొంపులేదంట
విన్నానులెమ్మనె వెట్టియొకతె
వీనికంటెను మన వీరమ్మపెనిమిటే
బాగుండెననె నొక్క పాపజాతి
పేరుగొప్పేకాని పెండ్లివారిది హీన
కులమంట యనె నొక్క కుటిలబుద్ధి

కోరికొనితెచ్చెరాజు బంగారమబ్బొ
పోలులెమ్మని యొకచాన మూతిముడిచెఁ
గొందఱీవిధి వీధిలో గుంపుగూడి
చాటిరయ్యాదె రచ్చపోట్లాట "రకము".

అంతటఁ బుష్పసేన మనుజాధిపుఁ డావిధి నేగి రాజసౌ
ధాంతరభూమియందుడిగి యందొనరించిన రత్నవేదిపై
కాంతలు వెంటరానరిగి క్రన్నననెక్కెను బేరఁటాండ్రు శు
ద్ధాంతమునుండి రాజతనయామణిఁ దోడ్కొనివచ్చి రాపయిన్.

తెరసెల్లఁగదియించి నూత్న వధువున్ దీర్పైన ముత్తైదువుల్
వరువామస్థలిఁ జేర్చిరట్టితతిఁ దత్పురోహితుండంచితా
ధ్వర కర్మాచరణ ప్రవీణుఁడనువొందన్ శాస్త్రదృష్టంబుగా
జరిపెన్ బెండిలిఁ బావనాగ్ని సవిధస్థానంబునన్ వారికిన్.

పసుపు ముత్యాలు దోసిళ్లఁబట్టి పైనఁ
జిమ్ముకొనిరప్డు దంపతుల్ సేసఁబ్రాలు
మామ చదివించె నావేళ మాగధునకు
నంగనోత్తుంగ తురగ మతంగజముల.

కంతుసమానులు యౌవన
వంతులు మదవతులు గలిసి వరుసన్ వైవా
హాంతమునందున సరస వ
సంతోత్సవమాడి రథిక సంభ్రమమెసఁగన్.

బావగారికిఁ జాలఁ బ్రాణంబులెమ్మని
"దర్బారుఁ" జల్లెఁ బైదలియొకర్తు
మఱఁదిగారికి దీన మనసుసుమ్మని "రాత్రి
రాణి" సిల్కెను భృంగవేణియొకతె
మామగారినిఁ జూడమఱచిరే యనుచు "ది
ల్బాహారు" పైఁజిమ్మెఁ బడఁతియొర్తు

వగలవాఁడీతఁడు వరుసగా దేయంచు
వటివేరు గురిసె జవ్వనియొకర్తు

పునుఁగు జవ్వాది యగరు కప్పురము మొదలు
గాగల సమస్త వస్తువుల్ గలిపిమెలిపి
జల్లులాడిరి తరుణులు సరసనిట్లు
భవన భాగంబులన్నియుఁ బరిమళింప.

కుంకుమచూర్ణముల్ విసరు కోమలిఁ బట్టుకొనంగఁబోయి మీ
నాంక సమానరూపుఁడొక యౌవనవంతుఁడు గంధవత్పయః
పంకిల భూమి జాఱిపడె భామిని క్రమ్మఱ నెత్తిపోసె ని
శ్శంకత వానిమీఁద నటఁ జందనగంధులు నవ్విరందఱున్.

పడఁతులు గొందఱొక్కరునిబట్టి కిలార్చుచు నీటముంపగా
నెడముగ గూరుచుండి యవహేళన మొప్ప మఱింతముంచు డం
చడలుచునుండె వేఱొకరుఁ డాతనిమీఁదనె గుప్పిరింతలో
బడబడ ముద్దియల్ వెనుకపాటునవచ్చి వసంతనీరముల్.

మిసమిస జవ్వనంపు నెఱిమించిన వాఁడొకరుండు వేడ్కకున్
బసుపును బూయువానివలె బాలనొకర్తుక నొత్తిపట్టి త
ద్బిసకుసుమోపమానపరిపీనకుచద్వయిఁ జెక్కుదోయి నే
ర్పెసఁగఁ గరంబునన్ దడవియేర్పఱచెన్ నఖరేఖలచ్చటన్.

కన్నులు రెండుమూసికొని కాంతయుఁ బూరుషుఁడిద్దఱొక్కటన్
సున్నపునీరు జల్లుకొనుచున్ బరిహాసమెలర్ప సత్వరో
త్సన్నదుకూలురై నెదురుతాఁకిళులొందినఁ జూచినవ్వి రా
క్రొన్ననఁబోఁడు "లిల్లెదురుకోలమహోత్సవమాయె" నంచొగిన్

సారెకు ముత్తియంపుఁబోడిఁ జల్లెడి లేజవరాలి మానినీ
మారుఁడొకండుబట్టి మటుమాయముగాఁ గొనిపోయెనేడకో
వారిసెఱుంగరై రచటివారలు సందడిలోన నిర్వురా
తీరునఁబోయి యేమిపనిఁదీర్చిరొ వచ్చిరి భుక్తివేళకున్.

కంపమునొంది నెన్నడుము కాంచిక గజ్జెలుమ్రోయఁ జాతురీ
లంపటలై మదాలస విలాసవతుల్ చెయిఁజెమ్మపుట్ట వ
డ్డింప నపూపముల్ పొడి వడెంబులు పచ్చడు లూరుబిళ్లు నా
డెంపురసంబు సాదముఁగడింది చవిన్ భుజియించి రందఱున్.

మేలగు సన్నచీరయది మెల్లని గాలికిఁ దూలికాసె కు
చ్చీలు దొలంగినన్ జఘనసీమ బయల్పడె నొక్క లేమక
ట్లా లలితోరుమూలము నిజాప్తునకున్ గనుసన్నఁజూపు కా
మాలను నొక్కనిన్ గసరె నంజనరంజితదృష్టినన్యయున్.

కులుకులరాణి యోర్తు తనకున్ బరిషేచన మాచరింపఁగా
వలసి పురఃప్రదేశమున వంగిన నాతఁడు పైఁటసందుగాఁ
దళుకు పసిండివన్నెగల దాని చనుంగవఁజూచు వేడ్కతో
ట్రిలఁబచరించుచుండెనట డిత్థడబిత్థమృషాప్రసంగముల్.

కోడెవయస్సునం దనరు కూరిమికాఁడొకఁ డగ్రభూమిఁ బూఁ
బోడిహిమాంబువుల్ తనకుఁబోయఁగనిల్చినమోమువాంచి మా
టాడక తత్పదాంతర మృగాంక శిలాస్థలిఁ జూడసాగె నా
జాడ యెఱింగి యమ్ముగుద సాగెను వేఱొకచోటికిన్ వడిన్.

నినుఁగవయంగ వేళ రజనీముఖరాత్రులలోన నేది? వా
కొనుమని యిక్షుఖండమును గుత్తపు మీసమునంటి సన్ననే

సిన బయకానికిన్ గలికి చెంగున మూసినచంద్రవంకతో
ననువుగఁదెల్పెఁ జంద్రుఁడపరాంబుధిఁ గ్రుంకినరమ్మటంచు నాగిన్.

ఇష్టమృష్టాన్నములతోడ నిట్లుమెసవి
లేచిరందఱు గండూషమాచరింపఁ
బిదప నెఱసంజదాఁక నాపెండ్లివారు
పడిన ప్రల్లదనంబది పలుకరాదు.

వేయి వెలుఁగులపతి నన్ను విడిచిపోయెఁ
జిమ్మచీఁకటి పైపైనఁగ్రమ్మవచ్చె
నెంతలోనెంత వ్యత్యాసమేగుదెంచె
ననుచు ముకుళించె నేత్రంబు లబ్జవల్లి.

చెడుగుచీఁకటి భయమెల్ల విడిచినిలిచె
రాజునగు నే నుపేక్షింపరాదటంచుఁ
దొగలమగఁడేఁడు మింటికి నెగిరిదూఁకి
పండువెన్నెలనింపె భూమండలమున.

ఇది మంచిముహూర్తము గద
గదియింపఁగ మగనితోడఁ గన్నియననుచున్
మదవతులు రాజవనితలు
ముదమున వాసంతికకును ముద్దులుగుల్కన్.

మొగలిరేకులు పైనమోటించి జడవేసి
జాజిపూవులచెండు సంతరించి
చిన్నిజాబిలిరేక వన్నెమీఱఁగదిద్ది
కలికికుచ్చులసూసకము నమర్చి

పొంకంపుఁజనుదోయి బుసుఁగు పూఁతలువెట్టి
చిలుకకంగులకోక మలచికట్టి
బెళఁగుగజ్జెలపైడి మొలనూలు బిగియించి
నవకంపుబైటిణీ ఱవిక దొడిగి

నగలుగైసేసి మగఁడున్న నగరుకడకుఁ
దోడుకొనిపోవ నృపకన్య తొట్రుపాటు
పొసఁగ దలమీఁద వలిపంబు ముసుఁగువైచి
చెలుల బలవంతమున నెట్లో చేరెనచట.

పున్నమ వెన్నెలన్ గడకుఁబుచ్చిన తెల్లని పూవుసెజ్జపై
సన్ననిగాలికిన్ గదలసాగిన దివ్వెల వెల్గువెల్లిలోఁ
గన్నుల దీటువుచ్చు తనుకాంతులతో నగుమోముదోఁప గూ
ర్చున్నకుమారమన్మథు వరున్ గని కన్య బిడానభీతయై.
ఎందఱులాగినన్ విడువకే గది గుమ్మముకమ్మిఁబట్టి మే
నం దడిచెమ్మటల్ వొడమ నక్కి మొగంబున బైఁటగప్పి ని
ల్వం దలిరాకుఁబోఁడియొకవామ విలాసముగారదప్రభా
కందళముల్ కపోలఫలకంబుల నాట్యములాడ నామెతోన్.

రసమెఱుఁగక యిటులిప్పుడు
కసరిన మిముబోంట్లె పతులుకైవసమగు న
ట్లసమశరుఁ గొల్వనేర్తురు
ముసుఁగేటికి దీయవమ్మ ముద్దులగుమ్మా!

అని యవకుంఠనంబు దిగువైపడలాగి కుమారి పైఁటకొం
గును మహీనాథచంద్రమునికోమలహస్తమునందుఁబెట్టి "చ

క్కని తెలివమ్మ యందఱును గందపుగిన్నియ వీడివచ్చినా"
రని గొని తెచ్చుదానివలె నా మగనాలు తొలంగె నేర్పునన్.

పోయినపోకగా మగువపోయెను వచ్చెడి జాడలేదు నే
నా యమఁబిల్చివత్తునని యన్యసతీమణి దాఁటెనల్లె లో
లాయతలోచనల్ వరుసనందఱు నేదియొ వంకఁజెప్పి వి
స్ఫాయదఖండరత్నమయ సౌధముడిగ్గి పరుండిరెచ్చటో.

తలుపుబిగించిపోయిరటు తామరసేక్షణలందఱింక నా
స్థలమున నేదియుం గదలుజాడ గనంబడదొక్క కల్వపూ
వలపులఱేఁడు చంద్రుఁడు గవాక్షపుసందులనుండి తొంగి లో
పల నవదంపతుల్ మెలఁగుపద్ధతిఁ జూచుచునుండె నత్తఱిన్.

సుమసమహాస యా సకలసుందరి యొక్కసువర్ణపేటికా
గ్రమున బిడారుజేసి మగరాల మలంచిన రాజహంసపో
తము బిగికేలఁబట్టుకొని ధారిణి వామపదాంగుళీనఖాం
తమునఁ దెమల్చుచున్ నిలువ నవ్వుచు రాకొమరుండుమెల్లనన్.

పూవులకూర్పుతోఁ గరగిపోసినరీతి మిలార్చు కీల్జడన్
జేవిడఁదీసివిప్పెఁ గటిసీమ బిగించిన కాంచిఁగింకిణీ
కావళిమ్రోయనూఁపె మలయానిలసంగతి వీఁపుమీఁద హే
లావిధి లేచియాడు మృదులంబగు పయ్యెదలాగె వెన్కకున్.

పాపటయంతయున్ జెదరి పాడగునట్లుగఁ జిక్కుసేసె శీ
ర్షోపరి, వ్రేలియుంగరము నూడఁగలాగి యురోజమధ్యమున్
రాపడఁగొట్టెఁ బైనఁ గపురంపు విడెంబుమిసెన్ గులాబిపూల్
పైపయిఁ గ్రుమ్మరించె మెడపై గిలిగింతలువెట్టె మాటికిన్.

ఎన్ని శృంగారచేష్టల నిట్లతండు
సేసియును ముద్దుగుమ్మతోఁ జిన్నమాట
నొక్కటైనను బలికింప నోపఁడాయెఁ
బొలఁతి మొగమున నవ్వైనఁ బొడమదాయె.

భర్తహస్తంబు తన పృష్ఠభాగమందు
నేమిసేసిన వారింప దింతయైన
ముందువైపునమాత్రము మోపనీదు
తరుణి యచ్చోట నేమేమి దాఁచుకొనెనొ.

చెలువ యీరీతి దానెంతసేపటికిని
సిగ్గువిడనాడి శయ్యకుఁ జేరకున్న
మగధనరనాథుఁ డిట్లను మందమంద
వచనరచనల మకరందనిచయ మొలక.

వనజాక్షీ! ననుఁజూడకున్నసరిపో వాతాయనంబూని మె
ల్లన వీక్షింపుము బైటకల్లదె సుమాళంబైన లేగాలికిన్
గొనలూగించి వనస్పతుల్ సయిత మీాకుందప్రభాబంధుచం
ద్రనవీనాతపశోభకున్ మిగులనానందించెడిన్ దిక్కులన్.

మలయసమీారణుం డుపరిమార్గమునన్ జనుదెంచిపొంచి నీ
కలితకుచద్వయంబు పయిగప్పిన పయ్యెదదూలఁదాఁకినన్
వలదని యడ్డుపెట్టవతివా! యిటు నీదరిఁజేరనీక న
న్నలమటపెట్ట, నంతటియనర్హుఁడనే భవదీయసేవకున్.

చిదిమినపాలుగారు నునుజెక్కులపై శ్రమవారిబిందువుల్
బొదలినవుత్తరీయమునఁ బోఁదుడుతున్ సెలవిమ్మునాతి! నీ

చెదరినరత్నహారములచిక్కులు వాపఁగనిమ్ము సమ్మతిన్
మదనమహోత్సవంబునకు మంగళహారము పాడనిమ్మికన్.

అని పువుఁబోడియంసమున హస్తముమోపిన దీసివైచి మె
ల్లన వసనాంచలంబు బిగలాగి తనూలత యింతయేనియున్
గనుపడకుండఁ గప్పుకొనఁగా నతఁడించుక సంశయించి పై
కొనెడివిరాళి కొంచెము నికుంచితమై పొడసూప నిట్లనున్.

మగువా ! నిన్ననుగొన్న నాఁడు మొదలామారుండు కారింపఁగా
సగమైపోతి నిదేకనుంగొనుము నాచందంబు, మున్నట్లు లేఁ
జిగురుల్ గూర్చిన పూవుబొత్తిడిన నీచిన్నారి మేల్పాటు ని
ప్పగిదిన్ సిగ్గునదాచిపెట్టుకొని నన్బాధింప నీకేటికిన్.

గరితా ! యింతటి పంతమూనఁదగునే గాఢానురక్తున్ ననున్
గరుణింపంగదె కోపమేర్పడియెనో కాంతల్ పఠింపించు నా
స్మరవాత్స్యాయనకూచిమారముఖశాస్త్రగ్రంథసాహిత్యమీ
వరుసన్ జూపెదొ చూడుమొక్కపరి నీవాలారుక్రేఁగన్నులన్.

అందపుఁజందమామ ! బదులాడ వమందమరందమాధురీ
స్పందముగాఁగ, నవ్వొకసారి మొగంబున లేఁతవెన్నెలల్
సందడిసేయ మన్మథ విషజ్వరపీడితు నన్నునింక నీ
చందమున్ గలంచుటకు స్వాంతమదెట్లు సహించె నీకహా.

మగువ! నీహరిణాంక మండలంబునఁజిందు
నమృతరసాయనం బాననిమ్ము
పడఁతి! నీబంగారు పర్వతంబులమీఁది
శిఖరదర్శనమైనఁ జేయనిమ్ము

మదవతి! నీశంఖ మధ్యంబులోనున్న
కోయిల నొకమారు గూయనిమ్ము
గంధేభయాన! నీ గగనరూపముచెంత
బసిఁడి సోపానాలఁ బ్రాకనిమ్ము
అతివ నీలేఁతకపురంపు టరఁటిచెట్ల
నడిమి కేదారమందలి కదుబెడంగు
తిన్నెపైఁజేరి మన్మథదేవునందు
లీనమగునట్లు యోగంబుఁ బూననిమ్ము.
అని యెంతసేపు బలికిన
విననితెఱంగున నటించు వెలఁదింగని యీ
యనువునఁ గాదని పతి నె
మ్మనమునఁ దలపెట్టె నొక్క మాయాపథమున్.
శయ్యకుఁ వ్రాలి రాజకులచంద్రుఁడు వేదనదోపఁ బల్కు న
య్యయ్యొ యకస్మాత్తుగాబాడ మెనక్కట యీతలయేరు; దుర్భరం
బయ్యె నిదేల పైకొనెనొ హా యిటువంటి ప్రమోదవేళ నా
కియ్యెడ నౌషధంబయిన నిచ్చుటకెవ్వరు లేరిఁకెట్టులో.
హరిహరి ప్రాణముల్ నిలువవక్కట హాస్యముగాగనెంచి న
న్నరయకుపేక్ష సేయదగ దౌషధమున్ గొనిరమ్ము లేమ! నీ
చరణములంటివేడెద నసహ్యశిరోవ్యథతోడ నేను దు
ర్మరణ దశోన్ముఖుండనయి బ్రమ్మపడ సిగ్గని డాగవచ్చునే.
అనుచున్ మిథ్యావేదన
గనిపింపఁగ నంగలార్చు కాంతునిమాటల్
విని చంద్రవదన హృదయం
బున లజ్జాభయము లొకటఁ బాడసూపంగన్.

ఎన్ని విధములఁ దను జేరకున్న నన్ను
మోసమొనరించి పొందఁగా బూనెనిట్లు
ధన్యజీవిత సంతమాత్రంబయేని
కాక నిజమైన నే మహాకలుషవతిని,

ప్రతిహతంబగుగాక పాపం బమంగ
ళంబు శాంతించుగాక దైవంబుసుప్ర
సన్నమగుగాక పతివాక్య సరణియెల్ల
నరయ బరిహాస మాత్రంబె యగునుగాక!

కాని యెటులైన నేనింకఁ గఠినభావ
మూనరాదంచుఁ దలపోసి యువిదమిన్న
సుందరంబైన వదనారవింద మెత్తి
వెనుకకు మఱల్చి మగనిఁ గన్గొనియె నపుడు.

కన్నులకాంతికిన్ నలుపుగట్టెను దీపములొక్కసారి లే
వెన్నెలగాసె గర్భగృహవీధుల నిద్దపుఁ జెక్కుటద్దముల్,
సన్ననిమందమారుతముసాగెను సాంకవ సౌరభాలతో
నన్నుల మేలుబంతి తనయాస్య మొకింత మఱల్చినంతనే.

ఫక్కుననవ్వుచున్ మగధపార్థివచంద్రుఁడు లేచి ప్రేయసీ!
చిక్కితివింకనైన దయసేయఁగరాదె యటంచు మెల్లగాఁ
బ్రక్కకుఁజేర్చి కొంతవడి పాపటిపూవులు చక్కఁజేసి వే
రక్కున నొక్కనే మరినయంతట రాజకుమారి నుబ్బునన్.

చెలువకరములు తొలుదొల్తఁ జెక్కులందుఁ
గుదురుమెఱుఁగుల బలితంపు గుబ్బలందు

మెలఁగి యనవాప్తఫలములై తొలఁగి పిదప
వస్త్రబంధన రక్షైకపరములయ్యె.

ఆవల భర్తబాహువులయందు నలంగుచుఁ గాంత యూర్పుచే
దీవియనార్పఁ గాని మణిదీప్తులలోఁ దననగ్నమూర్తి మ
ర్నావయవంబులెల్లఁ బొలుపార వెలుంగుచునుండె నంత ల
జ్జావనతాస్యయై మగని యక్షియుగంబును మూసెఁ జేతులన్.

పతి కనుంగవ మూయంగఁ బట్టువట్టి
విసివివిఫలప్రయత్నయై వెలఁదికొనకుఁ
దనదుకన్నులనే మూసికొనియె నౌర!
వనిత లజ్జాభరంబు నేమనివచింతు.

కవికులగురువైన కాళిదాసునినోటఁ
దొలకరి వఱదవై దూఁకినావు
హర్షనైషధ చరిత్రాంతరంబున మూల
ముట్టుగాఁ గరడులు గట్టినావు
భట్టబాణుని వచోభంగిలోఁ బుష్పించి
మంచివాసన గుబాళించినావు
పెద్దనామాత్యుని ముద్దుపల్కులలోనఁ
దేటయై మెఱుఁగులు దేలినావు

కలిత శృంగారరసమ! నాకావ్యమందుఁ
గమ్మగేదంగివలపులు జిమ్మినావొ
పసరుకాయల చిఱుచేదు బడసినావొ
చదివిచూచెడి విజ్ఞులౌ జనులకెఱుక.

---

# ప్రాయశ్చిత్తము

## హాస్యము

అచ్చుగ్రుద్దినయట్టు లలికమందున మూడు
తెలిబూదిరేకలు దిద్దినాఁడు
బ్రహ్మతేజము మేనఁ బరిఢవింపఁగ నూత్న
ధవళోపవీతంబు దాల్చినాఁడు
నిడుదఱొమ్మునగాక కడుపుమీఁదనుగూడ
శ్రీగంధ మొకయింత చిలికినాఁడు
కంకణాంచితమైన కరమున నేదియో
ప్రబలకావ్య మొకండు బట్టినాఁడు

అప్పుడే భోజనము లోన నాచరించి
కించిదాయాసమెసఁగ "శ్రీకృష్ణ" యనుచుఁ
బంచలోనున్న మంచాన వ్రాలినాఁడు
భంగపాటెఱుంగని రామలింగసుకవి.

కృష్ణరాయల పాలన క్రిందనొదిగి
మూడుపూలాఱుకాయల మురువుసూప
విజయనగర సామ్రాజ్యంబు విఱ్ఱవీఁగు
దినములవి, నాటి దీనేను వినుచు చరిత.

మేనువ్రాల్చెనోలేదో యీ లోననెవరో
దొడ్డివాకిలి తలుపట్టి ద్రోసినారు

"ఎవరువా"రని మన రామకృష్ణుఁడేగి
ఘనకవాటము బారలుగాఁ దెరల్చి.

ఆర్జితకీర్తిభూషిత దిగంతరులైన మహాంధ్రసత్కవుల్
ధూర్జటివార! యేమిది యెదో బహుభాగ్యముపట్టె నాకు లే
కూర్జితపండితప్రవరు లూరకవత్తురె రమ్మఁటంచు స
మ్మార్జితపీఠమేసి యెరిమంబున నాతనితోడ నిట్లనున్.

ఏమిటు దయగల్గినదే
నామీఁదట నెపుడులేదనామయమేగా ?
కామకవచ్చితి రిచ్చటి
కీ మిడిమధ్యాహ్న వేళ నేమికతంబో.

ధూర్జటి

హేతువేమియుండు నేమిటో నినుజూచి
పోదమంచుబుద్ధి పొటమరించె
నంతెగాని వాని యమ్మకడుపుమాడఁ
దాతిగానికంత దాష్ట్యమేమి?

రామకృష్ణుఁడు

ఏమిటి తాతాచార్యుల
కా మతి యతఁ డేమిసేసె గర్వాంధుండై,
స్వామీ! స్వామీ! యంచును
బ్రేమింతురె నిత్యమతనిఁ బిన్నలు పెద్దల్.

ధూర్జటి

ఏమి తాతాచార్యు లేమిసెప్పుదు వాని
పేరుమీఁదుగ నూరుమారణంబె

యే సభలోనైన నేమూలఁజూచిన
విశ్వరూపుఁడు వాఁడె వెలుఁగఁజొచ్చె
వెలిఁగినవెలిఁగె బో వీనిల్లుమసిగాను
గదిపినఁ గుక్కయై కఱవవచ్చు
క్షితికిఁ దానొక్కఁడే శిష్టాదిగురువేమొ
యెంతవారలనైన నీసడించు

నబ్బ యిఁకవాని యాటలకడ్డులేదు
పెద్దనాదుల కతఁడన్న ప్రీతిమెండు
రాయలకుఁగూడ నదియేమిన్యాయమగునొ
యతనిపలుకన్నఁజాలు వేదాక్షరంబె.

తగవుమీఱి మొన్న ధర్మనిర్ణయమేదొ
మినికినాఁడటంచు మెచ్చి పిచ్చి
ప్రభువు సత్కరించె బాబు! నాఁడాదిగాఁ
బడగవిప్పి యాడఁ దొడఁగినాఁడు.

పరగఁ బదిమందిపాటింపఁ బందికొక్కు
జగ్గరాజయ్యెనఁట యల్లె సమ్మతించి
యందఱముగూడ నవునవుననఁగగాదె
"విధవ" యీనాటి కొకధర్మవేత్తయయ్యె.

"కుల్లూకభట్టిందుఁ గొదికెఁజెప్పఁగలేక"
యంచు నాతనిఁ జప్పరించివైచు
"నిర్ణయసింధువీ నియమానఁ బెడత్రోవఁ
ద్రొక్కె" నంచును దానిఁ ద్రోసివేయు

"వైద్యనాథుఁడు మంచి వరుసలోననెవచ్చి
          పొరపడె"నని వానిఁ బ్రువ్వదిట్టు
"నెల్లయాజిది చాల హీనపాండిత్యంబు
          నొక్కలేఁడ"ని వాని వెక్కిరించుఁ

దానె పెద్ద ధర్మాచార్యులైనయట్లు
శాస్త్రవేత్తల నెవరిని సరకుగొనక
లేఁతలేఁతవి తఱిగి చేపోఁతవోయుఁ
బదుగు రొనగూడి యున్నట్టిపట్లనెల్ల.

అదియె నిజమని మొదనమ్మి యఖిలజనులు
పిల్లి బిడ్డను గనెనన్న వెళ్ళి యతని
కెలుకసేయఁగ సాగినా రిద్ది సహజ
గుణము లోకాని దెప్పుడు గొర్రెదాఁటు.

వాని ధర్మశాస్త్రంబులు వాఁడుచావ
వచ్చి యడిగినవారల కిచ్చవచ్చి
నట్లు చిన్నపాపానికి నంతులేని
పాచితముసెప్పి యగచాట్లపాలు జేయు.

కరణముగారింటఁ గాకిదూఱినదని
          మూఁడేండ్లవఱదాఁక మూయఁజేసెఁ
బెద్దిబొట్లకుమార్తె పెంటద్రొక్కినదన్నఁ
          బాదంబు నఱికించి భంగపెట్టె
దొడ్డయార్యుని నూతఁ దొండ చచ్చెనటన్న
          మంచిగాదని పూడిపించివైచె

మల్లెవారికుమారుఁ డుల్లిమెక్కినదాని
కింతంతయనరాని తంతుఁజెప్పెఁ

గుక్క పైకెక్కినని చెప్పఁ గోత్రివారి
మేడఁ బడఁగూలిపించె మోమోడకుండ
వానినాలుక పఱియలువాఱిపోను
పాపభయమైనఁ బొడమ దా పాతకునకు.

మొన్న సభలోన నేదియో చిన్నసూత్ర
మతఁడు తనయిచ్చవచ్చిన ట్లన్వయింప
నూరకొనలేక యదియట్టు లొప్పదంటి
నదియె నాతప్పుచూడు మా వదరుఁబోతు.

జేవురించిన మొగమింత జేసి యెఱ్ఱ
సెరలు నేత్రాంచలంబులఁ దుఱగలింప
బ్రహ్మసూత్రంబు నటునిటు బ్రాముకొనుచు
దండతాడిత భుజగమై మండిపడుచు.

ఏమేమీ? సరియైనయన్వయముకాదే? పోనిమీవ్యాఖ్యయే
దీ మాకింకొకమాటుసెప్పి శరణార్థిన్ బ్రోవఁగా రాదె యే
దో మార్పాటుననుంటి నెవ్వరసలో హా ధూర్జటిస్వాములో
నే మీపాండితిఁజూపవచ్చితిర? కానీ చూతమేపాటిదో.

అని పైననేమిటో యంతులేదది యవ
చ్ఛేదకంబట యవచ్ఛిన్నమంట
ప్రాగభావంబఁట ప్రధ్వంసమఁట ప్రతి
యోగియఁట సదనుయోగియంట

పక్షతయఁట కాక లక్షణంబఁట యేమొ
వ్యాపకంబఁట యింక వ్యాప్తియంట
ఘటమఁటతద్భిన్నపటమఁటసమవాయ
సంబంధమఁట వాని శ్రాద్ధమంట

యేమిసెప్ప వానియిల్లు మన్నైపోను
జంకుగొంకులేక జబ్బచఱచి
తడపిడ నిటుకొన్నితర్కసూత్రంబులు
గుప్పినాఁడు నోరుగప్పినాఁడు.

కలకలనవ్వి రొక్కపరిగా సభలోపలి వారలందఱున్
వెలవెలబోయితిన్ గడకు విత్తులుమ్రింగి విషంబుఁగ్రాసి నేఁ
దొలఁగితినింత సేయునొకొ ధూర్తుఁడు దేశము గొడ్డువోయెనే
తలగల పండితోత్తముఁడు తానొకఁడే? యిఁకలేరె యెవ్వరున్.

నోరుగలవాఁడ వీవెసుమ్మూరిలోన
నతని కీవైనఁ గొంతభయంబుసెప్ప
కున్న చెలరేఁగి మాబోంట్లనుంచునయ్య
వీడు కాడొనరింపక విడుచునయ్య.

రామకృష్ణుఁడు

ఎంతజేసెనుమలప మీయంతవారిఁ
బెద్దలనియైన గమనింపవద్దె యసలు
చీటికిమాటికిని బెద్దఁజేసి ప్రభువు
గారవించుట నతనికిఁ గాళ్లువచ్చె.

ఒక్కనాఁడిల్లె నామీఁద నుఱిమినాఁడు
గాని సమయంబుగాదని కనలడంచు
కొంటి నాటికినిఁక నదికొనలువేసి
గాలమై దేవుచున్నది కడుపులోన.

అతఁడొకమాత్ర భంగపడు నాతఁడుగాఁ డటులైననేమి నా
జతన మొనర్చిచూచెద విచారమునొందకుఁ డూరిలోన మీ
యతులిత వైదుషీపటిమ మన్న నెఱుంగని వాఁడెవండు దు
ర్మతి యొకడాడినంత నవమానమువచ్చునె మిమ్ముబోంట్లకున్.

ఆతఁడతండు మాటలిటులాడుచు నావలికేగిరంత సం
ధ్యాతపముల్ చిగిర్చి చరమాచలసానువిటంకశృంగసం
ఘాతములందుఁగాసెఁ గనకక్షితిభృన్మణికందరాంత రు
ద్భూతపరాగరాగరుచిధూసరకింశుకగుచ్ఛసచ్ఛవిన్.
ధి

తాతాచార్యులుగారే
దో తర్కగ్రంథమాని యూఁకొను శిష్య
వ్రాతమునకుఁ బాఠము సం
ప్రీతిన్ బోధించుచుండె విశదతరోక్తిన్.

ద్వాదశోర్ధ్వపుండ్రంబులు ధవళశాటి
తొళసితోమాలె మకరకుండలయుగంబు
పట్టుధావళితనరఁ గన్పట్టునతనిఁ
బాఱఁజూచినఁజాలు నాళ్వారిసేవ.

తాతాచార్యులు
పారమాపుడు ప్రామాణ్యవాదమెల్లి
మొదలువెట్టెదఁ గౌముది చదివి ప్రక్రి
యాంశమునుగట్టి గావింపు డంతెగాని
వడిగ నిటువచ్చుచున్నాఁడు వాఁడెవండు.

శిష్యులు
ఎవ్వరేమున్న దేదియో మెసరువోసి
కొంప కిటువచ్చుచున్నాఁడు కొంటెకోఁతి
మంచివారలనెల్ల నేడ్పించు వెట్టి
వెంగళాయి యయిన రామలింగమయ్య.

తాతాచార్యులు
ఓరి! వీనిత్రాటి నూరువెల్పలఁద్రెంప
ఏదొ క్రొత్తమెత్తు నెత్తినాఁడు
ఎవ్వరన్నఁ జిత్తమెఱియదునాకు వీఁ
డడ్డుపడినఁజాలుఁ జెడ్డభయము.

రామకృష్ణుఁడు

చాల సుదినంబు నేఁడు సాక్షాత్తు భాష్య
కార యోగీంద్రుకైవడిఁ గ్రాలుచున్న
మిమ్ముఁ బొడగంటి నెంత పుణ్యమ్మొ యెఱుఁగ
నార్య ! సర్వాపరాధి దాసోహమండి.

తాతాచార్యులు

రారమ్మ పీఠమిదిగోఁ
జారుపరీహాసరసవిశంకటరచనా
ధీరుఁడవు కార్యమేమిటో
నీరాక ముదంబుగూర్చె నిజముగ మాకున్.

రామకృష్ణుఁడు

కార్యమేముండు నింక మీకడకు రాఁగ
నాఱుశాస్త్రంబు లెఱిఁగిన వారలంచు
ధర్మసందేహ మొక్కటి తవిలి దానిఁ
దీర్చుకోనెంచి వచ్చితంతియె మహాత్మ !.

తాతాచార్యులు

ఓహో యిదేటిసంగతి మహోత్తమ విద్వదసాధ్యసాధ్య నిర్వాహుఁడవైన నీకెఱుఁగరాని విశేషము లేవిలేవె నేనా హావణించువాఁడను మనంబునఁగల్గిన సందియంబు సందేహముఁ దీర్చుకో నరుగుదెంచితో గూబలు పిండవచ్చితో.

చాలుఁబొమ్మింక నీచాకచక్యమెల్ల
నెఱుఁగుదును లెమ్ము నన్నేదో పరిభవించి
తాటియాకులుగట్టి పోఁదలఁచినావు
నేర్పు దోలుకాడ నిదియొక నెపముపూని.

రామకృష్ణుఁడు
గుండెలుచాలునొక్కొ తమగూబలుపిండ "నమశ్శివాయ" లే
దండి వటచ్ఛదంబులకునై యుదయంబునఁ జెట్టునెక్కఁ బై
నుండి పురీషమున్ విడిచె నూరక పోకిరివాయసంబదో
క్కండు కనిష్ఠికాగ్రమునఁ గావరమేమి వచింతు దానికిన్.

దానికేమి ప్రాచితంబో మిమ్మఁడుగంగ
వచ్చినాఁడ గాని కుచ్చితమున
భంగపెట్టి మిమ్ముఁ బదిమందిలోపలఁ
బరిభవింప నెంతవాఁడనయ్య.

పోతరించి గొడ్డుపోతు పర్వతరాజు
మీఁద డీకొనంగ మేలుగలదె
యట్లె మిమ్ముబోటి యతిలోకవిబుధుల
నెదిరికొనిజయింప నెవరితరము.

ఏదొమహాత్ములంచు జగమెన్నిన పండితనాథులంచు నా
కేదొ విముక్తిఁజెప్పఁగల రీ దురితానికటంచు నెంచి మీ
మీఁదనె దృష్టివెట్టుకొని మెల్లగవచ్చితి నిప్పుడంతగా
గాదనియన్న నేనడతుగాక వివాదములాడ నేర్తునే.

అనిన నాచార్యుఁ డించుక యలరినాఁడు
కొంచకదియంతయును విశ్వసించినాఁడు
"తప్పదా" యింక ననిలోని ధర్మశాస్త్ర
కోశ మొక్కటి చేతఁగైకొని మనమున.

కలిగె నవకాశ మీపలుగాకివాని
నడఁచుటకునంచు సంతోషపడి యొకింత

సేపు గ్రంథంబుఁ జూచి యేదోపఠించి
బాపలు చిటిలించిచెప్ప నీక్రమమువిూఱ.

నర మృగ పక్షిజాతులవసంబడు మూత్రమలంబు లెచ్చటన్
దొరయుఁ దదంగమున్నటికి తోడన నిష్కృతి సేయనొప్ప లే
కురక సహించునెవ్వఁడు మదోద్ధతి నాతని కంతిమంబునన్
జిరతరకాల మా నరక శిక్షయెసంగు భయానకంబుగన్.

పాపమకారణమే యీ
పాపముపైఁబడియె నీకుఁ బ్రాయశ్చిత్తం
బీపగిది చెప్పియున్నది
యేపట్టున ధర్మశాస్త్ర మెన్నినఁగానీ.

అనిన రామకృష్ణుఁ డంతయు నమ్మిన
వానికరణి మొగమువాంచి కనుల
దైన్యముట్టిపడఁగఁదప్పదు నాకర్మ
మిట్లుగాలెసేయ నేమిగలదు.

లేకున్న నేలవోయితి
నాకులకని మట్టికడకు నరిగినగానీ
కాకి యది రెట్టవేయునె
నాకిటు విధివ్రాసియుండె నవయఁగనేలా!

సెలవీక నాచార్యోత్తమ!
తెలిపితిరీరీతిఁ గరుణదేటపడంగన్
మలగక చిటికెనవ్రేలిఁకఁ
దొలఁగించెద ననుచు నింటిత్రోవంబట్టెన్.

---

ఎట్లు మెలివెట్టి కట్టెనో యెఱుఁగరాదు
నటికె నిజముగ వ్రేలని నమ్మెనెల్ల
జనము తాతార్యుఁ డెదలోన సంతసించెఁ
దగినశాస్తి యొనర్చితీతనికినంచు.

కడచిపోయెఁ గొంతకాలంబు తాతార్యుఁ
డాదమఱచెగాని యతని భంగ
పఱచు టెట్లనుచును బహువిధంబుల రంధ్ర
మరసి రామకృష్ణుఁ డంతమీఁద.

కొంచెము పెద్దగాఁ బెరటిగోడ సమీపమునందు గొయ్యిఁ ద్ర
వ్వించి పురంబులో నుదయవేళ వెడల్చునశుద్ధమంతఁ దె
ప్పించి బిలంబునింపె నది వెంటనె మాఁగుడువాఱి చాల నొ
ప్పించె సమీపమార్గమున వెళ్లెడివారి నసహ్యవాసనన్.

చల్లె దానిమీఁద శాకినీబీజముల్
పలుచపలుచగాగ భళి! యికేమి
పెంటబలిమి కలిమివేసిన వేరూపు
లగుచుఁ బెరిగె మొక్క లదిరిపడుచు.

ఎట్లు సడికట్టిమెఱిఁగెనో మెఱిఁగినాఁడు
తాతయార్యుని యింటిలోఁ దద్దినంబు
గలదు రేపంచు నప్పుడే గదలియేదో
కార్యమున్నట్టు లతనితోఁ గలిసినాఁడు.

ఇద్దఱునుగూడి కొంతసేపేమొ మాట
లాడి రంతటఁ దాతార్యుఁ డనియె నిట్లు

"తద్దినము రేపు మాయింట దానికేమి
కూరలగపడ వేరీతిఁ గూలఁబడునొ."

అంగడికిఁ బోవ నచ్చట నసలె లేవు
చచ్చిపోవుచునుంటిమి శాకములకుఁ
దద్దినముగూడ నిప్పుడే దాపురించె
మీరలేమి భుజించుచున్నారొగాని.

రామకృష్ణుఁడు

అవునవునండి! కూరలకునై తపియించుచున్నదూరు వేసవిగద మండుటెండలకుఁ జాలినయంతటినీరు లేమిఁ గ్రొంజివురులు మాడిచచ్చినవి, చెట్లును జేమలు దానఁ జిక్కకున్నవి వెలయెంతవోసిన, గనంబడ రెచ్చట నమ్మువారలుఁ

పెరటిలోపలమున్న నే పెరుగుతోఁట
కూరవిత్తులు చల్లితిఁ గొంచెమవియె
పోఁతనీటికి మొనసూపి బొద్దుగట్టి
కలవుకాలాన మాఁపుచ్చెఁ గాచుచుండె.

మీకంటె నెక్కు వేమిటి?
మాకిఁకఁ, గావలసియున్న మహితగుణాఢ్యా!
పీఁకుకొని తెచ్చుకొందురు
వేకువనే లేచిరండు వెఱవఁగనేలా.

పగటిపూటనైనఁ బదిమంది పొడఁగాంచి
మాకు మాకటన్నఁ బీఁకులాట

పొసఁగుగాన మీరు మసకచీఁకటిలోనె
వచ్చి తెచ్చుకొనఁగవలయుసుమ్ము.

తాతాచార్యులు

ఎప్పుడునుగూడ నే నన్న నిల్లె యాద
రాభిమానముల్ జూపెదవంతెచాలు
నల్లె సూర్యోదయాత్పూర్వ మరుగుదెంచి
తెచ్చికొనియెద లెమ్ము నీ యిచ్చకొలఁది.

—

గుబురుచీఁకటిలోనె కూపోదకముచేఁది
యఘమర్షణ స్నానమాడినాఁడు
వలుదగాఁ బండ్రెండు వారపింజలువోసి
పట్టుదోవతి మొలఁగట్టినాఁడు
వైకుంఠనామముల్ వరుసగా జపియించి
తిరుమణి పుండ్రముల్ దిద్దినాఁడు
ఉత్తరీయముతోడ నుదికిన నిడుపాటి
యంగవస్త్రము చేత నలమినాఁడు

తూర్పు తెలతెల్లనా తటి దొడ్డిలోన
నిలిచి రామకృష్ణుని మేలుకొలిపినాఁడు
తాతయాచార్యుఁడిఁక నేమి తనకుఁ దోఁట
కూరకాడలపైనున్న కోర్కెఁ జేసి.

లేచి రామలింగ మతనిఁ జూచి పెదవి
దాటివచ్చెడి నవ్వును మాటుకొనుచుఁ
బెరటిలోనికిఁ గొనిపోయి పెరుగుతోఁట
మడినిజూపించి వినయంబు గడలుకొనఁగ.

స్వామి! లోనికిమాత్రము జనకు డంచు
లందునైనను మంచివే యందుమీరు
ద్రుంచుకొనుచుండుడిదె నేను పంచలోని
కరిగివచ్చెద నిప్పుడే యని వచించి.

పంచలోనికరిగి పొంచిచూచుచునుండె
నంతఁ దాతయార్యుఁ డాశకొలఁది

పీఁకి మధ్యనున్న పెద్దకాడలమీఁద
మనసుదవిలి లోనికిని గమించె.

అబ్బ! యిఁకేమిసెప్పుదొాక యామమువోయెనొ లేదొ లోనికిన్
జబ్బలబంటిగామునిఁగెఁ జాలదినంబులనుండి మాగి పై
కుబ్బు నశుద్ధమందు నతఁడూపిరియాడని గబ్బుకంపులో
లబ్బున గోలవెట్టె వెడలంగమకించి వృథాప్రయత్నుఁడై.

అంతరామలింగ "మరరెయాచార్యుండు
కొంపదీసి పెంట గుంటఁబడియె"
ననుచు వచ్చియతని నటులాగి యిటులాగి
పొరలద్రిప్పి వెలికిఁ దెరలదివిచె.

పాపము పట్టువస్త్రములు పాడయిపోయె, శరీరమంతటన్
లేపనమంటినట్లు దవిలెన్ మలపంకము; పూతిగంధము
ద్దీపితమయ్యె వైష్ణవుఁడు దీనముఖుండయి విస్తుపోయి న
ల్దెవ్వపులఁ జూచుచుండెఁ బెరవారరుదెంచిన సిగ్గటంచిఁకన్.

అప్పుడు రామకృష్ణుఁడు రయంబున లోనికిఁబోయి యేడదో
త్రుప్పునదోఁగియున్న ముదితొొక్కొక గొడ్డలిఁబూని తెచ్చి నేఁ
జెప్పినఁగాని యంతపనిఁజేసితి రెంతటి ముప్పువచ్చె మీ
కిప్పుడయంచు దాని బయికెత్తెను జేతులఁబట్టి వ్రేయఁగన్.

ఒడ్డారించుచు వైష్ణవుం డదరి యొాహెూ చాలులెమ్మేమిటీ
గొడ్డంటన్నను జంపిపుచ్చెదవ? నీకున్ న్యాయమే? యంతగా
నడ్డంబై నినుబాధపెట్టితిన? యేమంచున్ విలాపింప నీ
విడ్డూరంబును జూడవచ్చెనిఁక నాపీడెల్ల నువ్వెత్తుగా.

రామకృష్ణుఁడు

ఏమండి యడ్డువెట్టెద
రీమధ్యను గాకిరెట్టకేగద మీరల్
నేమించినాక నిష్కృతిఁ
గామక ద్రుంపించినారు కఠినముగాగన్

నరమృగపక్షిజాతులవనంబడు మూత్రమలంబు లెచ్చటన్
దొరయుఁ దదంగమున్నటికి తోడననిష్కృతిఁ జేయనొప్పునం
చెఱిఁగివచించినారు తమరేగద నేఁడిది మర్త్యవిష్ఠతో
ముఱిగినగుంట పాపమఱిపోవుటకై మిముఁద్రుంపఁగూడదే!

ఎల్లరకును ప్రాయశ్చిత్త మేర్పరించు
మీరలేయాచరింపక యూరకొన్న
ధరణి కేగతిపట్టును ధర్మశాస్త్ర
మితరులకెగాని తమకన్వయింపదేమి?

అనినన్ సిగ్గునమ్రగ్గిపోయి యతఁడౌరా! నాడుదుర్నీతి గ
డ్డినిదిన్నాఁడను దానికీ కపటపాండిత్యంబుఁజూపించి నా
కనపాయంబగుబుద్ధి సెప్పితివె పోరాధూర్తుఁడా! యింతచే
సినగానీ మొలకెత్తనేర్చునఁటరా చేట్పడ్డ నీవ్రేలిఁకన్.

అనిన రామకృష్ణుఁ డప్పుడు తనచేతి
కట్టువిప్పి వ్రేలిగుట్టుదెలిపి
"ప్రాచితంబుఁజెప్పి భంగపెట్టితినంచు
సంతసించినావె స్వాంతమందు."

జనసామాన్యము బాధవెట్టెడి భవచ్చారిత్రమాలించి నీ
పనిపట్టింపఁగవచ్చితంతె యిఁక నా బంగారుబోల్ ద్రేలు నీ
వనినంతన్ దెగఁజూతునే మెదడులేదా నాకు విస్సన్న చె
ప్పునదే వేదముగాఁ దలంచుకొన బాబూ ! పిచ్చిపేరయ్యనే.

ఇట్టి ధర్మశాస్త్ర మెప్పుడుచెప్పకు
మడ్డులేదటంచు నదరిపడకు
మింక నైన లోకమెఱిఁగి సౌమ్యుండవై
కన్నుగలిగి మెలఁగుమన్న నతఁడు.

రోషరసంబు తన్నయనరోచిరుపస్ఫురితంబుగాగ "నీ
దోషము నిన్నెమ్రింగునిటుత్రుళ్లి కడున్ బడపోకు" మంచు నా
వేషముతోడనే కదలివెళ్లె గృహంబున కుక్కుదక్కి మం
త్రౌషధరుద్ధవీర్యభుజగాధిపు చాడ్పున వెచ్చనూర్చుచున్.

వచ్చినట్టివారు వాస్తనంబారసి
కడుపులుబ్బ నవ్వి వెడలిచనిరి
యెపుడు వ్రాఁకినదియొ యీ చిత్రచరితంబు
గప్పుమన్న దూర నప్పుడపుడె.

---

# పరిత్యక్త

## కరుణము

అంతటి భోజభూపతికి నాత్మజనై తనరారి క్షాత్ర వి
క్రాంత విహారులౌ నిషధరాజలలాముల గేహలక్ష్మినై
సంతత మిందుకాంతమణిశాలలలో విహరించునట్టి నా
కింతటిలోన నింతగతి యెట్లులిఖించితో దుష్టదైవమా!

పుట్టింటనేమున్న నోలుపారఁజేసిన
తులసి పూజనమెందుఁ గలిసెనొక్కొ!
పసిఁడియారతులెత్తి పంకజాక్షునిదేవిఁ
గొలిచిన ఫలమెందుఁ గూలెనొక్కొ!
యత్తమామలసేవ లతిభక్తిఁజేసిన
సుకృత మేయేటిలో సురిగెనొక్కొ?
విసువక యేప్రొద్దు వేడ్కఁగావించిన
యతిథి తర్పణ మెందుఁ జితికెనొక్కొ?

ఎన్నిజేసిన నేమి నీవిట్లు మగఁడు
విడువ నడవులఁబడి గోడుగుడువుమనుచు
పాపదైవమ! నాఫాలఫలకమందు
మూఁడుబంతులతో వ్రాసి ముడిచినావె.

చెలువల్ వేవురు పాదపూజనలుపన్ సింగారపుంగద్దెపై
గొలువుల్ దీర్చెడి వ్రాఁతబోయి కడకున్ ఘోరాటవీమధ్యలోఁ

బులిపిల్లల్ పఱవళ్లుదోలునిట వాపోవంగ నూరార్చు నె
చ్చెలిగూడ౯ గఱవాయెనే నిషధరాట్సీమంతినీ దేవికిన్.

పుచ్చలతోఁటతోఁ జెలిమిఁబొంది మహాదశలోననున్న మా
పచ్చని కాపురంబు నిటు పాడొనరించి కఠోరమూర్తివై
చిచ్చొడిఁ గట్టినా పవలఁజేసెడిదేమిటి దీననైన నీ
ముచ్చటదీరెనే నిదురబోయెదవే యిఁక దైవఘాతుకా!

చీలనిజంటరైై వలపుఁజెంది రతీకుసుమాస్త్రులోయనన్
మేలిమి మందువానగరుమేడలలోఁ గనువిందుగాగ మా
యాలుమగల్ చరించుటకు నాత్మసహింపక కన్నుగుట్టి పా
పాలకుభైరవుండవయి పాల్పడితే యిటు వేఱుదీయఁగన్.

ఎంతటి దీనవర్తనులనేనిఁ గనుంగొనినంతనే దయా
స్వాంతముతోడ వారివిషయంబున జాలివహింతుగాని నే
నింతగలట్టివాని హృదయేశ్వరినంచుఁ దిరస్కరింప, న
న్నింతటి ఘోరదుర్దశకు నీడ్చుట ధర్మమటంచుఁదోచెనే.

పాడితొలంగి యిట్లదరిపాటునఁ గ్రూరనిశాచరుండవై
కూడెడి కాపురంబుఁ బడఁగూల్చితి వీదురితంబు నిన్ను వె
న్నాడిచరించి దైవహతకా! పుటమార్పదెత్రొక్కి త్రొక్కి వే
యేఁడులు చేసికొన్నయది యింతయు నూరక గాలికేగునే.

కుడువఁగఁ గూడు కట్టుకొన గుడ్డలులేని బికార్లుగాగ మ
మ్మడవుల పాలొనర్చి హతమార్చిననార్చితి వోదురాత్మ! నీ
కదుపది యెట్టులోర్చెనో మృగధ్వని ఘూర్ణితమైన కోనలోఁ
బడఁతికిభర్తకున్ బ్రణయబంధముఁజీలిచి వేఱుసేయఁగన్.

హా దినరాజతేజ! కుముదాప్తకులాభరణంబ! హా త్రిలో
కాదరణీయ రూపగుణ! హా నలభూవర! హా మహాత్మ! నీ
పాదములే పరార్థమని భావనఁజేసిన ధర్మపత్ని నే
హా దయవాసినట్టడవికాహుతిగా నొనరించిపోయితే.

లోకులకైనలోఁగకిటు లోనిసతీప్రణయానుబంధమున్
బీఁకి పెటార్చివైచి సుమపేశలగాత్రిఁ ద్వదీయదుర్దశా
వ్యాకుల, జీవితంబుభవదర్పణచేసిన ప్రేమరాశి నీ
కాకులుగ్రద్దలున్ జొఱనికాననభూమినిడించి పోయితే.

దైవము నీవెయంచు నిరతంబుమృగాంకకులావతంస! నేఁ
బూవులలోనఁబెట్టుకొని పూజలొనర్చితిఁగాని యెన్నడున్
భావమునందునైన నొకపాపము నీయెడ నావహింపలే
దీవిధి నన్ద్యజింపమనసెట్లు సహించెనొ ప్రాణనాయకా!

అంతటిప్రేమ నాపయి మహాత్మక! యేవిధి నంతరించె నీ
యంతటిపుణ్యమూర్తి హృదయంబున నేగతివచ్చిచొచ్చె దు
ర్దాంతకఠోరమీకటికిరాతితనం, బిఁక నేల పెక్కు జ
న్మాంతరఘోరపాపమిటు లాఁకలితో ననుమ్రింగదూఁకెరా.

ఎంతటికెంతవచ్చె హృదయేశ్వర! నీకును నాకు భేదమా
వంతయులేదటంచు భవదంఘ్రులె కొంగుపసిండియంచు నా
స్వాంతమునందు నెంచుకొని సంతసమొందితిఁగాని నేటికీ
వింతలు సేయుదంచుఁ గలనేనిఁదలంపఁగలేదురా విభూ!

పావనమైన ప్రేమరసపాకముదప్పినఁ దప్పనిమ్ము నా
థా! వనితామతల్లి యిది యన్నెము పున్నెమెఱుంగనట్టిదే

యీ విధి నొంటిగా విడిచి యేగిన నెంతకృశించునో విషా
దావిలరూపమై యనుదయాభరమైనఁ గలంపదో నినున్.

వచ్చినదాదిగాగ సరివారలు మెచ్చుకొనంగ దేవ! నీ
యిచ్చకువచ్చినట్లు చరియించితిఁగాని యొకప్పుడైన నే
గ్రచ్చలకంపనై యెదురుగట్టఁగలే దటువంటి నన్ను నేఁ
డిచ్చట మోసగించి చన నేగతి పాదములాడెనో ప్రభూ!

నీవే నా రతనాలకొండవనుచున్ నిత్యంబు భావింతు, నీ
సేవాకార్యమె మోక్షరాజ్యమనుచున్ జేయంగనూహింతు; నా
జీవాధారము నీవెయంచు నెపుడున్ జింతింతు; నన్నిట్లు పా
రావారంబునఁ ద్రోసిపోతివటరా రాజన్యచూడామణీ!

కోమలమైన నీ హృదయగోళమునం దెపుడుద్భవించెరా
స్వామి! విషాగ్నికీలములు పానముఁజేసిన వాక్కసారిగాఁ
బ్రేమరసాంబుపూరమును భీకరమా యిటువంటి వహ్ని నీ
లో మొలకెత్తియుంట మదిలోఁ దలపోయక మోసపోతిరా.

ఎంతటి ముద్దరాలవుగదే దమయంతి! నలుండు నిన్నుఁ గ్రా
న్గంతలలోనఁ బెట్టి చనునా? యతఁ డొక్కనిమేషమైన నీ
సంతత మందహాస విలసన్ముఖవీక్షణ మాచరింప కెం
తెంతలువచ్చినన్ నిలుచునే మతిమాలికలంగితివింతమాత్రమే.

చన్నవి రాజ్యభోగములు సంపదలెల్లఁ దొలంగెఁగాని నీ
యున్నదె రాజధాని యెటులోర్తు భవద్విరహాగ్ని కీలలం
చన్నియు వీడివచ్చి తనయందునె ప్రాణము నిల్పుకొన్న భా
ర్య న్నను మోసపెట్టి చనునంతకృతఘ్నుఁడె నా నలుం డహా.

నట్టనడికాన నొంటిగా నన్నువదలి
తొలఁగిపోవంగ నాయందు దోషమేమి ?
కీర్తిఘనుఁడైన నలచక్రవర్తి యంత
కుటిలబుద్ధియె నమ్మించి గొంతుగోయ.

కాదదె వేణుగుల్మమిటు గన్పడుచున్నది దానిచెంత నా
మోదిత దిక్తటంబులవె మొల్లపొదల్ చెలువారు వానిలో
నా దెస తీవియల్ గదలునచ్చట నన్ జడిపింపడాఁగినాఁ
డా దయమానమానసవిహారి నలుండొక వేడ్క చూపగన్.

తీఁగియలలోన నింకేల డాఁగెదవుర !
దొంగ! కనుఁగొంటిలేర నీయింగితంబు
నెంత గగ్గోలు పెట్టితివింతలోన
రార మోమిటుఃచూపరా రాజచంద్ర!

సూనశరాసనాంగ! నిను జూడని దొక్కక్షణంబు నిల్వఁగా
లేనటువంటిదాని లవలీదళ కోమలగాత్రి నిట్లు దూ
రానఁదొలంగఁబెట్టి యిటు రాఁదగునే సరసాలుచాలు నా
థా! నినుఁజూచినేర్చుకొనరా యెవరైన మహావనంబురా.

“హానిహతాస్మి” ప్రాణవిభుఁడంచునువచ్చితి గంపెఁడాసతోఁ
గానిలతానికుంజమునఁ గల్గుతృణంబులమేయు నేణసం
తానమిదొక్కటింక జననాయకుఁ డీదురదృష్టురాలికిన్
గానఁగవచ్చునే కరడుగట్టినశోకమునార్చిపుచ్చునే.

ఎక్కడడాఁగినావుహృదయేశ్వర ! వద్దురపంతమయ్యొ ! యిం
కెక్కడిప్రాణనాథుఁ డెటకేగెనొ యేమియొనర్తువ్యాఘ్రముల్

కుక్కలకీతిగాఁ దిరుగు ఘోరవనంబున నాఁడుదాని నే
నెక్కడటంచు నిన్వెదకు దీశ్వరసత్కృప యిట్లువచ్చెనే.

అంతటి దిక్పతుల్ కబురులంపినఁగాని తిరస్కరించి భూ
కాంతులు చిన్నవోయి విఱుగంబడిచూఁడగ నాఁడు కొల్వులోఁ
గంతుసమాన! నీమెడనుగట్టితినే సుమదామమున్ మహా
దంతమదైన నాకొకవిధంబునఁ దోడ్పడకుండెనే మదిన్.

జలజాతాప్తుఁడు గ్రుంకువెట్టని మహీసామ్రాజ్యమే సర్వమం
గళమాయెన్ మిడిమేల మీముగుఁదరత్వామూలమాయంచుఁ గే
వల వైరాగ్యముఁబూని మానివయి పోవంబైనమైపోయితే
నలరాజా! మునికాంతనై కదలిరానా చెప్పినన్ వెంటనే.

మొండికరాసుకట్టెయిది పొమ్మనిచెప్పినఁ బోవలేను నా
కండలు చెండుచున్నదిఁకఁ గాననమందున నిట్లుగాని యీ
ముండకుబుద్ధిరాదనుచు మోసమొనర్చితెనాథ! నీకు నే
నుండుటయంతగామదికి నోర్వఁగరాని విషాదమాయెనే.

ఎక్కడిదీమృదుస్వనమహీనము స్వాదుమరందమాధురుల్
గ్రక్కెడినబ్బ! యెంతటిసుఖంబొనగూర్చెను వీనుదోయికిన్
సొక్కినదంతరాత్మ, శిరసుల్ గదలించిన వొక్కసారిగా
నిక్కడితీవియల్ సయితమీరికలెత్తెడి యారసానికిన్.

కూ, యనికేకవేసిరదిగో నటుప్రక్కరసాలసాల, మ
త్యాయతమైన దానిచివురాకుల జొంపములందు నుండియీ
చాయకువచ్చి శబ్దమురసమ్ములఁజిమ్మె మఱెవ్వరాదురా
హా యెఱుకాయె నామగనిదాగళనాదము నిశ్చయంబుగన్.

ఆకసంబునఁ జెట్టుపైనడఁగియుండఁ
బొదలు వెదకిన నేనెట్లు పొందఁగలను
దొంగ నట్టింటిలో నుండఁ జెంగలించి
యూరిబయళుల నరసిన సారమున్నె.

స్వామీ! చంద్రకులోత్తమాభరణ! నన్ సాధింపఁగా నెంచినా
వేమీ! యేమయిపోవుదున్ గహనమందీరీతిఁగావించినన్
నీ మాయల్ గమనించి పట్టుకొనఁగా నేనెంతదానన్ సతీ
సామర్థ్యంబులు నీయెఱుంగనవియే చాలింపుమీ వేడుకల్.

నిదురబోనిచ్చి యడవిలో నిర్భయముగ
ముదితవిడనాడి వచ్చినమోసగాఁడ!
తెలియవచ్చెను లెమ్ము నీ తెఱఁగుకొంత
యింక నీతోడ మాట్లాడ నించుకైన.

తీఁగెమిటారులార! నరదేవుఁడు నాహృదయేశ్వరుండదే
లాగుననో గనంబడెఁ జలంబున మీరిటు లడ్డువచ్చిన
న్నాగకుడమ్మ! భక్తి నిదె యంజలిఁజేసెద సత్వరంబుగాఁ
బోఁగరుణింపు డా మనుజపుంగవుఁ గన్నులఁబట్టి రావెదన్.

మోసము మోసమయ్యొ! నలభూవరు కంఠనినాదమంచుఁ బే
రాసయొనర్చి వచ్చితి మదాకులకోకిలరాజమిచ్చటన్
గూసెను గూయటంచు నదిగో ననుఁజూచి తొలంగఁబాఱె నా
యాసము మాత్రమే మిగిలె నాత్రముతో నిటవచ్చినందుకున్.

కోకిలపోతమా! వెడలఁగొట్టిరి రాజ్యమునుండి శత్రువుల్
కాక, మగండుకూడ నడికానకు నన్బలియిచ్చెఁ గంచెలోఁ

గాకి విధాన నేఁబడెడి కష్టములన్నియుఁ జాలకిప్పుడే
నీకునుగూడ వేడుకజనించెనె నన్నిటు భంగపెట్టఁగా.

వడఁకుగదిరె మేనఁ దడిచెమ్మటలు గ్రమ్మెఁ
గాళ్లు బందులాడెఁ గదలిపోవ
నాల్క పిడచగట్టె నాథ! నట్టేటిలో
ముంచిపోయినావె మోసగించి.

ఎచ్చటనుంటివోగద హృదీశ్వర! యేమి దలంచుకొంటివో
యిచ్చట నొంటి నన్వదలి యేగుటకై తపియించి యెంతగా
వెచ్చని యూరుపుల్ విడిచిపెట్టితివో విధితంత్రమిాక్రియన్
వచ్చెను దాఁటిపోవనగునా? యిఁకనెంతటివాని కేనియున్.

పాడు నిద్దుర నన్నేలపట్టవలయుఁ
బట్టెఁగాకంతలో నింతపుట్టవలెనె?
యినుపగజ్జెలతల్లి పైనెక్కియుండ
నెంతలెంతలు పుట్టకే యేలతప్పు.

ఇంతటితోడనాకు నిజమే మరణం బగుగాక దానికిం
జింతిలబోనుగాని నృపశేఖర! యీ గహనంబులోన నీ
వెంతతపింతువో కెలన నెవ్వరు పల్కుటకైనలేక దు
ర్దాంతవియోగ దీర్ఘదినరాత్రములే విధి వెళ్లబుత్తువో.

అసమశరోపమాన! యెపుడైన మదంకముదిండుగా లతా
కిసలయశయ్యపై నొఱగి కించిదమందముగాఁ బయంటతో
విసరఁగ నిద్రవోదు విఁక వెచ్చని యీ ముడిరాళ్ల నేలఁ బై
వసనమువాల్చి కూరికెదవా కడ కన్నులనీరు వెట్టుచున్.

మాసినవల్వతోఁ బొదల మధ్యములో శయనించి యున్నని
శ్వాసమలీమసంబుల దిశావలయంబులఁ జూచు నిన్ స్థలీ
వాసినులైన దేవత లుపాస్తి యొనర్తురు నేత్రకోణ ని
ర్యాసితశోకబాష్పకుసుమావళితో విధిబ్రువ్వ దిట్టుచున్.

బ్రాహ్మముహూర్తానఁ బాయక మేల్కాంచి
సెలయేటి నీటిలో జలకమాడి
బంగారుచాయతోఁ బరిమళించెడిమేనఁ
బూదూళిబసుమంపుఁబూఁతపూసి
యడసగట్టిన జడల్ విడదీసి కొనగోట
నాతపచ్ఛాయకు నాఱబట్టి
దలిమంపు నీర్కావి వలెవాటుక్రిందుగా
జింకచర్మము నొక్క చంకనిఱికి

యాశ్రమానికి వచ్చి బ్రహ్మార్పణముగఁ
దపము లొనరించుకొనుచు నిత్యంబు శాంత
మానివయిపోయి యడవిలో మాఱుమూలఁ
గడపుకొందువు కాబోలుఁ గాలమింక.

ఉరుకరుణారసార్ద్రలగు నో వనదేవతలార! మీ కిదే
కరములు దోయిలించి చిరకాలమొనర్తు జోహర్లు నా మనో
హరుఁడిట ఘోర కాననమునందుఁ జలించిన మానసంబుతోఁ
దిరుగుచునుండు నొంటిమెయి దీనముగాఁ, గనిపెట్టియుండుడీ.

క్షాత్ర తేజితమైన చంద్రవంశానికిఁ
బున్నెంపు మొలకమై పుట్టినాఁడు

జలధి చతుష్టయవలయితంబగు నేల
నాలుగంచులుబట్టి యేలినాఁడు
గర్భమాదిగ నింతకాలంబు వఱదాఁక
భోగదేవేంద్రుఁడై పొదలినాఁడు
పరభైరవుండయి హరిదంతములలోన
నిజయశశ్చంద్రికల్ నించినాఁడు

కాలవశమున నేటి కీగతులుబట్టె
బ్రతికిచెడినాఁడతండు నిర్భాగ్యురాల
నొంటిగా డించిపోవుచునున్నదానఁ
గరుణ దళుకొత్త మీరైనఁ గావరమ్మ.

మానధనులందు మేటియాగాన శత్రు
కృతపరాభవ మాత్మసహింపలేక
యెంతసాహసకృత్యానికేనిఁ గడఁగు
నతని నొక కంటఁగనిపెట్టి యరయరమ్మ.

ఇల్లువదలినదాదిగా నింతదనుకఁ
గంటికిని ఱెప్పవిధమునఁ గాచికొంటి
నింక నేమైనగాని నే నెఱుఁగబోవ
నరుగుచుంటిని మీ చేతులందుఁబెట్టి.

నైషధావనిచంద్ర ! దీనత్వమొంది
సాహసమొనర్పఁబోకు కష్టంబులొక్క
తావుననె యిల్లుగట్టి పంతంబుమీఱఁ
గాఁపురముసేయఁగాబోవు కలుగుమార్పు.

చేరెఁడు కన్నులున్ సొబగుచిందెడి చెక్కులుగల్గి మీటఁ బొ
ల్గారెడి నీ మొగంబుఁ బొడఁగాంచఁగలేనిఁక నీభవంబులోఁ
దీఱఋణంబు నేటికి, మదిన్ దయయుంచుము పోయివత్తు నీ
పేరెజపించుచున్ గడవఁబెట్టెదఁ గాలము స్వర్గభూమిలో,

శత్రువులుకత్తిగట్టి రాజ్యంబుగొనుట
నాకతంబున నేగదా నాథ ! నీకుఁ
గష్టములకెల్ల నేనెపో కారణంబు
బ్రహ్మరాక్షసినై నిన్నుబట్టుకొంటి.

మానవనాథచంద్ర ! యనుమానములేదు శనిగ్రహంబనై
పూనికలంచితిన్ విడిచిపోవుచునుంటిని నేఁటితోడ, నా
తోనె తొలంగు నిన్నడఁచుదుర్దశలన్నియు వీటికేగి నీ
వైన నొకింతసౌఖ్యపడుమా కలకాలమురాజ్యలక్ష్మితో.

కాని నీకెందుమఱువంగరానిదొకటి
నలుసులుండెద రిర్వు రానందనులను
గరుణఁగనిపెట్టియుండు మీవరయకున్న
దిక్కులేనట్టిపక్షులై పొక్కఁగలరు.

ఏమిసేయుచునుంటిరో ప్రేముడించి
తాతపెనుపంగబంగారు తండ్రులార !
యావటిల్లుచు మీతల్లి యడవిలోన
నుసురుగోల్పోవుటెఱుఁగరు నిసుఁగులార.

సార్వభౌముని గర్భవాసానఁబుట్టి
పిల్లదొరలయి గారానఁబెరిగినారు

పుడమిఁ ధలిలేని బిడ్డలై పోయినారు
చివరి కీరీతి మీ వ్రాఁత చిన్నవోయె.

ఇక్కడనుండి మీజనకుఁ డింటికివచ్చిననాఁడు చిందులన్
ద్రొక్కుచువచ్చితండ్రిదయతో వచియింపవె "యమ్మయేది" యిం
కెక్కడ నున్నదంచడిగి యే ప్రతివాక్యము నందలేక న
ల్దిక్కులు సూచు మీవదన దీనత కీ జగమెట్టు లోర్చురా.

అమ్మా! భీమునిరాణిరో మఱచిపొమ్మా నన్ను నీకోనలో
దుమ్మైపోవుచునుంటి నీదినముతో, దుఃఖింపఁగాబోకు దై
వ మిమ్మారీతి ననుగ్రహించె మును దేవబ్రాహ్మణారాధనే
ద్ధమ్ముల్ పుణ్యము లెన్ని చేసితివొ యీదార్భాగ్యురాలింగనన్.

ఏమిది; నాల్గుదిక్కుల నొకేపరి గ్రమ్మినదెట్టిడాలు, సం
ధ్యామహితారుణాతపమ; తామరసాప్తుఁడు గ్రుంకుజాడ లే
దే, మఱియేమి? కాననమహీస్థలి నెట్టని యెండలుండు నే
మో మును పెప్పుడున్ వినము, మోహితమైక నుదృష్టిమాఱెనో.

ఇంతకు నేనెవర్తె నసలిక్కడ నుండఁగ హేతువేమి? దు
ర్దాంత విషాదమేదొ భిదుర ప్రతిపాతభయంకరంబు నా
స్వాంత మగల్చుచున్నయది హా, తెలిసెన్ నలభూవరేంద్రుఁ డే
కాంతమునందు వీడి చనఁగా మతిబోయిన దాననేగదా.

కొంపమునిఁగినదయ్యయ్యొ ఘూర్ణమాన
ఘోరదావానలంబిదిచేరవచ్చెఁ
జటులకీలాపరంపరల్ చదలఁ బ్రాఁకె
ఛటచటాత్కారములుగూడ సాగెనవిగో.

ఓ కలుషాపహారకలితోత్తమదైవమ! గోరుచుట్టుపై రోఁకటిపోటుగా నిటవరుండదయుండయి వీడిపోవ దుశ్శోకసముద్రమధ్యమునఁజొచ్చి కలంగుచున్న నన్ను నీ లోకభయంకరద్యుతులలోపల మాడిచివైవవచ్చితే.

అయ్యో! యెంతటివెఱ్ఱినై యడలుచుంటి
బ్రదుకరోసిన నాకింక భయమదేల
రమ్మురమ్మయ్య! నీ శిఖారాశి కిదిగో
రమణిసుకుమార జీవనీరాజనంబు.

వాఁగదోలెడి శోకానికాఁగలేక
చచ్చుటకు నేనుపాయంబు జతనుపడక
యడలు నాకొకదైవమై పొడమినావు
సాయపడుమయ్య నను భస్మసాత్కరించి.

దేవా! క్రతుభుజ్ముఖుఁడవు
గావా నినువంటివాని కలితార్చులలో
జీవములెడలుటకంటెను
గావలసినదేమిగలదు గ్రక్కునరావా.

వెలుఁగొందున్ భవదుగ్రతేజమున నీవిశ్వంబులీరేడు నీ
వలనన్ జచ్చుటకంటె వేఱుగలదా భాగ్యంబు కానీయిఁకన్
నలభూకాంతుఁడె నాకుఁబ్రాణవిభుఁడౌనా జన్మజన్మాలలో
వలపీమాత్రమనుగ్రహింపగదె దేవా! యగ్నిభట్టారకా!

అకట! త్రుటిలోన మటుమాయమయ్యె నగ్ని
హర్షమొందితినే దుఃఖమాఱెననుచు

నేల? నాబోటి దురదృష్టురాలి కిచటఁ
జావు సమకూడ దభిమతసమయమందు.

ప్రతిదినంబును గుక్కలభంగిదిరుగు
వన్యమృగములు నేఁడిటువైపురావు
వానికినిగూడ వధ్యంబు గానిదేమొ
పతికిఁ గానట్టి యీ నాదు పాడుమేను.

ఓ నరమాంసభక్షణసముద్ధత ఘోరమృగంబులార! రా
రే ననుమ్రింగిపోరె మనుజేంద్రుని నైషధుధర్మపత్ని నీ
కాననమందు మీకు బలిగా నొడగూర్చె విధాత యింక నే
లా నెనరాప్తులున్ బతియు నందఱు రోసిన యీయభాగ్యపై.

అని యీరీతి విషాదమేదురముగా నారణ్యకస్థాణువుల్
గనులన్ బాష్పమువెట్టఁగా నడలుచున్ గాంతాశిరోరత్న మే
మనుజాధీశుని ముద్దరాలొ కొమరుంబ్రాయంబులో నున్న దే
మని వాకొందుఁజలించి నేలకొఱగెన్ హాదైవమా!యంచుఁ కన్.

అంటిన మాసిపోవఁగల యామె తనూలత వాడువాఱఁ గీ
ల్గంటు బిగింపువోవ నవకంపునెఱుల్ భువిఁగప్పుకొన్న వా
కంట స్రవించు నశ్రువులు కాలువలైనవి చెక్కులందుఁ బూ
వంటి మడుంగుచీరె సగఁబాలు చినింగిన దేమిహేతువో.

కన్నులుమోడ్చి మూర్ఛమునుఁగంబడి నేలకువ్రాలి లేఁతవా
సన్నని బాహునాళములు చాపి బయల్ కవుఁగింటనొత్తు ని
ష్పన్నముగానిరీతిఁ గెలసంబున నేవొ వచించు నెవ్వరో
సన్నిధి నున్నయట్లు తన సత్కృతికిన్ దనివోయినట్లు, హా

సొమ్మసిలి గాథమఱచె నా శోకమూర్తి
యరుణభానుఁడుగూడ నస్తాద్రికరిగ
లేచి యిఁక నెంతయడలునో లేఁటికరణి
నట్టనడికానఁ గలికిగాంధారివేళ.

ఆమె భీమనరేంద్రు గారాముబిడ్డ
ప్రథితయశుఁడైన నలునకుఁ బట్టమహిషి
కొనకు నెనలేని విభవంబు గనునుగాని
పాప మేనాఁటిదో వచ్చిపడియె నిపుడు.

—

# శపథము

## రౌద్రము

కలుషాత్మకుం డౌర కౌరవ్యరాజు
నిలువునగిలుబాడె నిఖిలసంపదలు
దానితో విరమించి తనివోవరాదె
మానినిజగదేకమాన్యచారిత్ర
నోలగంబునఁ జీరలొలిపించి యిట్టు
లీలువుదప్పించి యెగ్గాడఁదగునె
పరమశాంతుఁడు గానఁ బాండవాగ్రజుఁడు
సరియెకానిమ్మనిసైరింపవచ్చు
గోళ్లువెంచిన మహా ఘోరసింహంబు
సిళ్లుసూచిన గంధసింధురప్రభువు
కాలి త్రొక్కిడివడ్డ కాలసర్పంబు
గాలికిన్ రేఁగిన కార్చిచ్చుమంట
యైనభీమనరేంద్రుఁ డభిమానమేది
యీనికారంబెట్టులెదలోన సైఁచె
నిదియనిదంపూర్వమెంతో చిత్రంబు
గదయంచు సభవారు కలకలంబెసఁగ
ననుకొనుచుండి రా యవసరంబుననె
ఘనగదాఘాత ఢాంకారస్వనంబు
వికటాట్టహాస నిర్భిన్ననాదంబు
ప్రకటబాహూరు నిర్ఘాతారవంబు

కటువులై రోదసీగర్భగోళంబు
పెటిలిపోవఁగ మ్రోఁగెఁ బేరోలగమున
బమ్మెరగొని జనుల్ పరికించిచూడ
నమ్మమ్మ యిఁకఁ జెప్పనగునె యారూపుఁ
బ్రళయభైరవమూర్తి ప్రత్యక్షమయ్యె
నిలువునఁ జెమ్మటల్ నిండిపోయినవి
గండస్థలంబులు కటకటనదరె
మండె నెఱ్ఱని సెఱల్ మహితాక్షియుగళి
ముదుగు కన్బొమదోయి ముడివడిపోయెఁ
జెదరె మిఙ్గురులాస్యసీమలోనుండి
యీరీతి నుగ్రుఁడై యేర్చి భీముండు
సారెకుఁ దనగదన్ జళిపించుచనియె.

ఓరీ! పౌరవవంశనిర్మథన! గర్వోద్రేక సంరంభ మే
పారన్ గూసెదవింక నాపుమదిగో నాధర్మరాజాజ్ఞచేఁ
గోలల్ వోయినరీతిఁ బైకుఱుక సంకోచించె లేకున్న నీ
వారిన్ నిన్నును భీమసింహమెపుడో వాల్గోళ్ల భేదింపదే.

మాయాద్యూతములోనఁ బాండవుల సంపద్రాజ్య సర్వస్వమ
న్యాయంబొప్పహరించినాఁడనని త్రుళ్లాడంగనేలా దురా
త్మా! యేనాటికినైన వారిపటుకోపాభీలవైశ్వానర
స్ఫాయత్కీలలు చుట్టుముట్టుకొనినిన్ భస్మంబుగావించురా.

లేరేరాజులు జూదముల్ గలుగవే లీలావిధిన్ గెల్వరే
వారీరీతిఁ దెగించి పల్కుదురె దుర్వాదంబు లౌరా చతుః

పారావారపరీతభూతలములోఁ బ్రాజ్యంబు పూజ్యంబునౌ
కౌరవ్యాన్వయమెల్ల నీకతన నగ్గంబయ్యె దుష్కీర్తికిన్.
శూరోదారులఁ బాండురాట్సుతుల నిచ్చో మోసముంజేసి గ
ర్వారంభ ప్రతిలిప్తమానసుఁడవై యట్టాఁడగా నేటికిన్
బోరానీచుఁడ! వచ్చు లేమనకు రేపోమాపొ సంగ్రామ మీ
ధీరత్వంబటఁజూపినప్పుడుగదా దీపించు నీపోడుముల్.

అరిభూపాలక సైన్యసమ్మథన శౌర్యాటోపుఁడైనట్టి మా
నరుఁ డుగ్రాహవయోగ్యచంద్ర మణగాంధర్వాశ్వ సంపన్న ది
వ్యరథారోహణముం బొనర్చి శరఘోరాసారమేపారఁగా
నరుదేరన్ బరికించి నవ్వుదువులేరా మమ్ము నేఁడేటికిన్.

మంథానాచలఘూర్ణితాంబుధి మహాంభస్థానమున్ బోలెనీ
స్కంధావారము పాయలై విఱుగధిక్కారించి త్వద్వాహినీ
గంధేభంబుల నాగదాభిహతులన్ గారించు నాఁడిట్లు క్రౌ
ర్యాంధా! ప్రేలెదుగాకఁగాఱులిపుడేలా చాలునోర్మూయుమా.

మానస్థైర్య గుణోత్తరుండయిన భీమక్షోణినాథుం డిఁకీ
మేనన్ బ్రాణములుండఁగా మఱచునే మీ వడ్డపాట్లెల్లఁగా
నీ నేఁడేటికి ఘోరసంగరమురానీ దైవతంత్రంబునన్
నీనాలావు లెఱుంగరావె యపుడేనిన్ దుష్ట! దుర్యోధనా.

కౌరవదుష్టవంశలయకాలునిగా గుఱుతింపు మీ మహా
క్రూరుని భీమసేను నవికుంఠిత బాహుబలప్రచండుఁడై
వీరవిహారముల్ సలిపి విశ్వధురంధరుఁ డాతఁడెప్డొ మీ
నూరుపురన్ వధించి యపనోదమొనర్చు దురంతకోష్ఠమున్.

శాపథవర్తులై శకుని కర్ణుఁడు తోడ్తో నరింపఁగా సము
ద్దీపిత రాజ్యలోభమున దేవసమాను నజాతశత్రు నేఁ
డీపగిదిన్ సభన్ బరిభవించితిరే కొఱమాలి పొమ్మిఁకన్
మీ పురుగేలకున్న నిది మోసముగాదు నిజంబు నమ్ముఁడీ.

తొలఁగక పాండుపుత్రకులతో సమరంబొనఁగూడినన్ మహా
బలుఁడినపుత్రుఁడిందు మనప్రాపుగదాయని యెంతువేమొ క
ర్ణులు శతసంఖ్యలొక్కపరి రోషముతో నెదురైనఁగాని నా
విలసదమోఘబాణముల వీరరణావనికిచ్చెదన్ బలిన్.

నీతిదొలంగి పాండుధరణీవిభునంతటివాని కోడలిన్
బూతచరిత్ర నిట్లు మొలపుట్టములూడిచి భంగపెట్టఁగా
జూతువె నిండుకొల్వున, యశోధనులైన పృథాకుమారకుల్
చేతులు చచ్చియుండిరని చిత్తమునందనుకొంటివేమిరా.

ఎంతచేసిరార ! యెడ్డెతనంబునఁ
గ్రుడ్డిరాజుకొడుకు లొడ్డుమిగిలి
భార్య నిట్లు మానభంగంబుగావింపఁ
జూచువారె పాండుసూను లకట.

ఓరీ ! భీముడ ! మానవంతుఁడవుగావో సిగ్గులేదేమి గాం
ధారేయుల్ సెలరేఁగి నీయెదుట మీ నారీశిరోరత్నమున్
గారింపన్ దలయూఁచిచూచెదవ నీ క్షాత్రంబుదుమ్మాయె నే
లేరా ఛీ యిఁక నేల పౌరుషగతుల్ లేనట్టి యీ జీవముల్.

చండారాతిసమూహసంహరణ దక్షంబౌగదాదండమా !
రండాపుత్రులుకౌరవుల్ దెగడువారా నిన్ను లేలెమ్ము నే

నుండన్ నీకొకశంక యేమిటికి నష్టోత్సాహార్త విద్విష
త్కాండంబుల్ దెగిపాఱఁగావలయు నీగంతుల్ విలోకించినన్.

అని యంతకంతకు నగ్గలంబైన
ఘనకోపమున నేలకదలిపోవంగ
ధగధగాయిత గదా దండమంకించి
జగములేర్వగవచ్చు చండీశునట్లు
లేచి యడ్డములెండులెండు సభవారు
చూచెదనేపాటి శూరులో వీరు
నేటితో నూతేండ్లు నిండెఁగాబోలుఁ
బాటింపఁ గౌరవ ప్రభుసత్తములకు
మాన శౌర్యములున్న మగవాఁడెవండో
మీనుమీసముగల్గు మేటియెవ్వాఁడో
రండురండిదె ఘోర రణరంగమునకుఁ
బాండురాజునకేను బ్రథమానసుతుఁడ
భీమనామమువాఁడ బిరుదుమానిసిని
కామించి దొరసితిఁ గదనాంగణంబు
నేటితోలోకంబు నిష్కౌరవంబు
పోటుబంటగువాఁడు పొడువంగవచ్చు
నంధరాజనదనమై యల్లాడవలయు
గాంధారి కోడండ్ర కంఠసూత్రములు
పావన గంగాస్రవంతితీరమున
తేవులో నొకనాఁడె త్రెంపఁగావలయు
ధార్తరాష్ట్రుల రక్తధారలం ద్రావి
ధూర్తభూతములెల్ల దోగాడవలయు

నిదె చంపెదను వీరికెవఁడడ్డుపడునో
మదమెక్కి పడినారు మలపలీరీతి
ననుచు దూకెడిభీము నట్టెవీక్షించి
జనము గగ్గోలెత్తె శాంతనవుండు
గురుఁడు ధర్మజుఁడును గోపంబుసూపఁ
దరుణంబుగాదిది తగ్గుమంచాఁగ
నిలఁబడి యతఁడొక్క నిట్టూర్పువుచ్చి
పలికె శపథంబిట్లు పదిమందివినఁగ.

ఓరీ! కౌరవ! పుణ్యసాధ్వికి దురుద్యోగప్రమత్తుండవై
యూరుల్ జూపితి వాతొడల్ విఱిచి నిన్నుగ్రాహవక్షోణిలో
వీరుల్ విస్మయమందిచూడ వధఁగావింతున్ నిజంబింత మా
ర్వేరన్ బిల్వుము చంపకున్న నిదె నావిల్లంటి భాషించితిన్.

—

# వ్యూహ ప్రవేశము

## వీ ర ము

అదిగోఁ జూచితె చేరవచ్చెఁ గురుసైన్యాంభోధి తద్యోధరా
ట్పదసంఘట్టనజాతధూళులవిగోఁ బ్రచ్ఛన్న మార్తాండతన్
బొదలెన్ మింటరథంబు సత్వరముగాఁ బోనిమ్ము సేనల్ బదా
బదలై దిక్కులువట్టి పాఱవలె నా బాణంబులన్ సారథీ!

మూఁగిన శత్రులోకములు మ్రుచ్చిరివోవ నమోఘదర్పతన్
రేఁగి చరించునన్నుఁగని రెండవ పాండవమధ్యముండు వీఁ
డేగెడనుండి వచ్చెనిఁక నెక్కడిగెల్పని నేఁడు సంగరో
ద్యోగముమాని సంధికి సుయోధనుఁడే యొనగూడిరావలెన్.

లయసమయసముద్భూతకీలాకరాళ
దహనభైరవమస్మత్ప్రతాపవహ్ని
కౌరవారణ్యభూములఁ గాల్చికాల్చి
భస్మమొనరింపకే శాంతిఁబడయఁబోదు.

ఒడ్డుభేదించుకొని లోనికుఱుకునపుడె
యదరి బెదరెత్తిపోవలె నరిబలంబు
మేలుమేలని దేవతల్ మింటనుండి
పఱపవలె మీఁదఁ బూవులవానజల్లు.

అనుపమ రాజలోకయుతమై కురుపాండవ యుద్ధమెన్నడై
నను సమకూడునొక్కొ జననాయకు లబ్బురమందిచూడ నే

ఘనతరనైపుణంబున ముఖాముఖి శత్రులతోడఁబోరు శో
భన దివసంబువచ్చునోకో పండువుగా నని నిత్యమూరెదన్.

అంతటిపార్థులైనఁ జొఱనట్టియుపాయమెఱుంగరంట నా
వంతఁట వ్యూహభేదనము వాకొనెనంట యుధిష్ఠిరుండు దు
ర్దాంతచమూవిదారణవిధానమొనర్పఁగఁ బోవుటంట నా
కింతటికన్న వేఱగలదే పరికింప ముదంబు సూతుఁడా!

ప్రాజ్యలోకైక విజయ ధురంధరుండు
తండ్రిగారున్న మనకిది దక్కబోదు
తొలఁగదీసిరి సంశప్తకులు వినీతు
లిచటలేకుండ నేటికాసుచరితాత్ము.

మాన్యపాదులు మేనమామగారికి నేఁడు
పరిమళ శుభకీర్తులొఱగవలయుఁ
బ్రేమతోననుఁబెంచి పెద్దచేసిన పితృ
దేవుల ఋణమెల్లఁ దీఱవలయు
వేల్పుల పూజగావించి గాంచినతల్లి
యుదరంబు హేమమై పొదలవలయుఁ
బాండుభూపతి వంశపౌరుషజ్యోతికి
నాకాశగంగ మాఱాఁగవలయు

నేటి నాయుగ్రరణయానధాటి విన్న
నడలి గర్భస్థపిండముల్ వెడలవలయు
శౌర్యవంతుల గణనాప్రసంగమందు
నేనె చిటికెనవ్రేలిపై నెక్కవలయు.

వాజులనదల్చి మింటలేవంగనిమ్ము
జన్యభూమికి వీరాభిమన్యురథము
పోవు తెఱఁగిట్టిదే? సూత! యావటిల్ల
వలదె శత్రువులరదంబువంకఁ జూచి.

అని సుభద్రాసుతుండు శౌర్యరసమురలి
వెల్లివాడువంగఁ బలికిన విని తదీయ
సమరసన్నాహసంరంభసరణికులికి
సూతుఁడిట్లను వెడనవ్వు చొప్పడంగ.

పాలవయస్సుగూడఁ గడబట్టగలేదు కుమార! నీకు, ము
న్నాలములందు నెన్నడనువారఁగ గాకలుదీరిలేవు, నేఁ
డేల తెగించియొంటిమెయి నీ కురువీరులమీఁదఁ బేరెముల్
దోలెదవంతమంచిదని తోఁపదు నీ జతనంబు నామదిన్.

చిన్నతనంబుగానఁ బలుచిక్కులెఱుంగవు కాక వ్యూహమున్
బన్నినవాఁడమోఘరచనాచణుఁడైన గురుండు దానిలో
నున్న చమూప్రధానపతులూరక నీవదలించి తోలఁబ
ప్పన్నలుగారు లోకములనన్నిటి మ్రింగెడి కౌరవోత్తముల్.

బొడ్డూడని బిడ్డఁడ వీ
వొడ్డారముచాల దొడ్డదొప్పదుచన నీ
వుడ్డాడిపోదువచ్చట
నడ్డంబై శత్రులదుము నవసరమందున్.

అమృతభానూదయాలోకనాతివేల
ఘూర్ణమానమహాభయదార్ణవంబు

విధమునన్ రేఁగు కౌరవవీరసేన
నొంటి సాధింపఁ బార్థుని కొకనికగును.

నిలువునఁ గనుపాపఁ దొలఁగించు మాయల
మారి సుమ్మల్లగాంధారరాజు
మతిబలంబున బృహస్పతి చెవుల్ వాడిచిన
సాహసికుఁడు కుంభసంభవుండు
ధైర్యశౌర్యములందుఁ దారకాసురజేత
మఱపింపఁగలవాఁడు గురుసుతుండు
జగములఁ గబళింపఁజాలిన గండర
గండ యా, యంగభూమండలేంద్రు
డందెవేసిన చేతు లీ యందఱొక్క
పెట్టుననువచ్చి నినుఁ జుట్టుముట్టుకొన్న
నలమటించుచు నన్యాయమగుదువీవు
బోనులోఁబడ్డ మృగరాజపోతమట్లు.

మాటలకును గ్రియల్ పాటించుటకును
జాలదూరముగల్గుఁ జాలింపుమింకఁ
బాపమిల్లే మున్ను భావమఱంది
యుత్తరుం డెన్నెన్నో మెత్తగాఁబలికి
కడకుఁ గౌరవసేనఁ గాంచినంతటనె
గుండె నీరయిపోయి దండాలువెట్టె
నాతఁ డేమైన నీకాచార్యకంబు
నొనరించెనాయేమి? తొనకిపల్కంగ
నాటలాడుచుఁబోవ నత్తవారిల్లె

కాదుకావది చండకదనరంగంబు
కాక మొన్ననెగదా కల్యాణమయ్యె
వస్త్రాల పసుపైన వదలగాలేదు
ముచ్చటలేవియు ముగియంగలేదు
ఎందుల కాకన్నె నేడ్పింతువన్న
పెదతండ్రియైనట్టి భీముఁడో లేక
సత్యకసూనుఁడో సాహాయ్యపడినఁ
బోవచ్చు నొంటిగాఁ బోరాదు మనకు
నామాట విను నీకు క్షేమంబుగలుగు
ననిపల్క నభిమన్యుఁ డలఁతి నవ్వొసఁగ
సూతుఁడా యెంతటిశూరుండవోయి!
కట్టిపెట్టుము స్వస్తికాండమంతటితో
సంతసించితిని వాచాలత్వమునకు
బట్టుపై గొంతకపొట్టిపోవంగఁ
గురుబలంబులఁగూర్చి కొట్టిపోసితివి
స్తోత్రపాఠములింతమాత్రంబుచాలు
నెఱుఁగకుండిన నింకనెంతజెప్పుదువో
మతిహీనులైనట్టి ధృతరాష్ట్రసుతుల
బ్రతుకుబండార మేపాటిదో మాకు
తెలియనిదనియేమొ తెగఁజెప్పినావు
బాల్యంబునుండి యీపాపాత్మకులను
గాచిపోసితి మింతకాలంబుదనుక

ఈ కురుసేనగాదు మఱియిట్టివి నూఱొకలైన నెదిర్చినన్
నా కరవాఁడిబాణములనాటి యమాంతము శత్రువీరులన్

రేకుమడంగగొట్టెద వరించెద నే జయలక్ష్మి సారథీ!
వాకొననేల యిప్డై కనుపట్టును మత్పటుబాహుశౌర్యముల్.

లెక్కకుండిననుండనీ లేళ్లగములు
కొదమసింగంబు నేమైనఁ గొఱకగలవె
కౌరవాధములెందఱు గ్రమ్ముకొన్నఁ
బార్థపుత్రుని పఱవడిఁ బట్టఁగలరె.

పరబలంబులఁ గనుఁగొని పాఱిపోవ
మాత్స్యరక్తంబుగాదిది మానశౌర్య
ధైర్యసాహసగుణగణోద్దండులైన
పార్థుల మహోష్ణరుధిరవిజ్వాలగాని.

కండగఱచిన పులిగండుకరణి సైన్య
మధ్యమందు నిర్ధూమధామమున రేఁగి
వీరవాహ్యాళిసలుపు నన్బాఱఁజూచి
గురుఁడు గిరుడెచ్చటో డాఁగుకొనరె వెఱచి.

రంగదభంగశౌర్యమున రక్తనదుల్ ప్రవహించినట్టి నా
సంగరఘట్టమున్ జదివి జానపదుల్ మెలివైచిపిండినన్
బొంగులువాఱుచున్ రుధిరపూరము లూరవలెన్ దురంగమా
తంగచయంబు గూలు భయదధ్వని వీనులగల్పగావలెన్.

సకలదైవతరాజు నాస్థానమంట
పమున నాయుద్ధగీతికల్ ప్రత్యహంబు
పాడవలెఁగిన్నరీబృంద మాడువేళ
జంత్రమధురారవంబుతో సాళగించి.

వీరరస ముగ్గుపాలతోఁ బెట్టినారు
రోమరోమంబునందున రోష మురలి
చిందిపాఱెడి నీమేనఁ జెడునె నీదు
బీతుమాటల కులికి నా ఱాతిగుండె.

ఒకవేళన్ మరణంబె కల్గుననుకొమ్మో సూతుఁడా! యిచ్చటూ
రక కౌరవ్యులచేతఁజచ్చెదనె సంరంభించి సైన్యంబు వే
నకువేలం దెగటార్చి యోధులకు దీనత్వంబువుట్టించి తే
నికిఁ జిత్తంబున గాలమై తవిలి నే నిద్రింతు నాపైభువిన్.

పుట్టి పెరిగినపిదప నీ పుడమిలోన
నల్లె శిలవేసికొనియుండు నతఁడెవండు
మరణ మేనాటికైనను మానవులకుఁ
దప్పఁ బోదది ప్రకృతితత్త్వంబుసుమ్ము.

ఎన్నాళ్లు బ్రతికిన నేమిలాభంబు
చచ్చిన మనియున్న సర్వలోకములు
చెప్పుకోవలె నోటి చెమ్మవోవంగ
నున్న మూన్నాళ్లైన నుర్వీతలంబు
పట్టపవల్ గాగ వర్తింపవలయు
నంబేదమై శోభనంబేమిలేక
యవనిపై పెక్కేఁడు లల్లాడనేల
యెందాకఁ గులగిరు లేపారఁగలవో
యెందాక రవిచంద్రు లిలనొప్పఁగలరో
యెందాక నంభోధు లింపొందఁగలవో

యందాక నాశౌర్య మఖిలభూతములు
ప్రొద్దుప్రొద్దున లేచి పొగడంగవలయు
మ్రోడులు పులకింప మొనఁదొల్చినట్టి
నాగాథ కవిలోకనాథులావారు
కామించి మునుముందు హేమాక్షరములఁ
బాత్రానుగుణముగాఁ జిత్రింపవలయుఁ
జావన్న భయపడు సన్యాసియెవఁడు
ఉష్ణరక్తంబిదే యుద్ధదేవతకు
బలియిచ్చి త్రిదివంబుఁ బాలింపఁబోదు
ముచ్చటులేటికి ముదితయేమిటికి
నందనవన మహానందవాటికల
మందార తరుషండ మంటపస్థలుల
పుణ్యభాగీరథీ పులినాంతరముల
జాంబూనదాచల సానుదేశముల
దివిజకాంతాస్తనదిగ్ధకస్తూరి
చందన ఘనసారచర్చ లీమేన
వాసింప నిత్యంబు వయ్యాళిసేతు
వేయి మాటలిఁకేల వినుము చెప్పెదను
భారతీయులకెల్లఁ బ్రథమవీరుండఁ
జచ్చిన స్వర్గంబు సాధింతుఁ దిరిగి
వచ్చిన రాజ్యంబుఁ బాలింతునింతె
యింక మొదలితివేని నిదుగో ఖడ్గంబు
వ్రేటున దలఁద్రెంచి విసరివైచెదను
అని యిట్లు సౌభద్రుఁ డదలించుచుండె

నంతలో స్యందన మనిల వేగమునఁ
బోయి కౌరవ చమూవ్యూహంబుఁ జొచ్చె.

రూపుదాల్చి వచ్చిన రోషవహ్ని
యుగ్రసింహంబు మెడఁగట్టియున్న ఘంట
మింటఁబెట్టిన దీప మా మేటిమగఁడు
పిఱికితనమునఁ బగఱకు వెఱచిచనునె.



# బిందుసారుఁడు

## భయానకము

కటితలంబున నెఱ్ఱని కావిఁగట్టి
బక్కచిక్కిన మేనిపై బసుమమలఁది
నిలిచి పరికించుచుండె మానివరుఁడొకఁడు
శీతలచ్ఛాయమగు మఱ్ఱిచెట్టుక్రింద.

అపుడొక రాజపుత్రుఁడు భయాకులితుండయి పాఱివచ్చి య
క్కపటమునీంద్రు పాదములఁ గట్టిగఁ జేతులతోడఁబట్టి, యే
డుపుదళమై కనుంగవఁ గడుంగడు జాఱెడి బాష్పవారితో
స్నపన మొనర్చి కావవె యనాథుని నన్నని వేఁడ నాతఁడున్.

నవ్వి యసూయఁజెప్పెడి యనాదరణేక్షణముల్ నిగిడ్చి నీ
వెవ్వఁడ వేమిహేతు విటులేడువ, నేమిక తాన నొంటిగా
నివ్వనభూమిలోనఁ జరియించెదవన్న నతండు దైన్యముల్
నివ్వటిలంగ నేత్రముల నిండినయశ్రుల గోటమీటుచున్.

మానికులోత్తమాభరణమా! యెటుచూచిన దిక్కులేని నా
దీనచరిత్రమంతయును దెల్లముగా వివరింతుఁ బచ్చి గం
గైనను ముట్టినేటికి నహర్నిశముల్ కడచన్న వొక్క మూ
డు నిశితమైన యాఁకలికి డొక్కలు డోరుననంటెఁ జూడుమా.

అని మహీవరబాలకుఁ డా ప్రశాంత
వటకుటచ్ఛద హిమగంధవాహములకు

సేదదోలఁగిన తనగాథఁ జెప్పఁదొడఁగె
ఘట్టఘట్టానఁ గన్నీళు లుట్టిపడఁగ.

కలితసంపత్సమృద్ధికిఁ గాణయాచి
నిరుపమానంద ముజ్జయినీపురంబు
దానిఁ బాలించు నుదయనధాత్రివిభుఁడు
తనయుఁడను నేను వానికి మునివరేణ్య.

కాలవశంబుఁ జెందె ననుఁగాంచిన రెండవనాఁడె తల్లి నా
పాలిటఁ గల్పవృక్షమయి బాల్యమునన్ జనకుండుబ్రోచె నా
పాలసుఁడైన ధాతకుఁ గృపారసమింత జనింపలేదు గా
బోలును దండ్రికూడఁ జనిపోయె నిఁకేమివచింతునావిధిన్.

నాటిదృశ్యంబుదలఁచిననాఁడు నాకు
గోరఁదీసిన నేఱుగాబాఱు నశ్రు
లట్లు జనకుండు రాజయక్ష్మామయమున
నార్తుఁడై చివరకు జీవితాశవదలి.

మా పినతండ్రియైన వసుమందిరుఁజేరఁగబిల్చి, కేల నన్
జూపి కుమారు, రాజ్యముఁగనుంగొన నీవెయటంచు నింక నే
దో పలుకాడఁబోయి పయినోపికలేక మదాస్యమంటి నే
త్రోపగతాశ్రుఁడై యసువులూడ్చి దివంబునకేగె నేనిఁకన్.

పెరిగితిని కొంతకాలంబు పిన్నతండ్రి
రక్షణంబున నతఁడు క్షణక్షణంబు
గారవించెను నన్నల్లి గడచెఁగాని
కాలబాహుళ్యమున మార్పు గలిగెఁ గడకు.

రాజ్యలోభమెనసి రాక్షసుఁడై వాఁడు
నన్ను మంతనమున నఱికి వైవ
భటుల కాజ్ఞయిచ్చెఁ బాపకార్యములకుఁ
గొదకఁడెప్పుడైనఁ గుత్సితుండు.

అతనికుమారుఁడైన యుదయార్కుఁడు స్నేహబలంబుచేత నే
కతమున నన్నుఁబిల్చి తనకన్నుల నీరురులంగ నన్న! నిన్
హత మొనరింప యత్నము లొనర్చుచునుండెను దండ్రి, నేటి రే
చతురతఁ దప్పుకొమ్మవల జాగొనరించినఁ బ్రాణహానియౌ.

అని వచియించెను నా కిఁక
మనసు మనస్సునను లేక మాపటివేళన్
మునిమసకలోన నాఁడే
జననస్థలి వీడిపోవసాగితి నంతన్.

ఊరుదాఁటి కొంతదూరమేగితి నంత
వీఁడెవీఁడె పోయె వేగపడుఁడు
పొడువుడన్న కేక లడరిన వెనుకకుఁ
బాఱఁజూచినాఁడ భయముగదిరి.

ఎఱుఁగనివానితోడ వచియించెదఁదండ్రి! యిఁకేమిసెప్పుదున్
గఱకుఁ గటారులెత్తికొని కాలభటప్రతిముల్ దలార్లు నా
తెరువున వచ్చుచుండిరి వధించుటకై పినతండ్రి పంప, నా
మొఱకులఁ జూడగానె విడిపోయెను నా సకలానుబంధముల్.

తూలెను గార్యమంచు దరితోఁచక యప్పటికైన రీతి నేఁ
గాలికి బుద్ధిసెప్పితి నెకాయెకి వారలు నాపిఱుందనే

నేల పదాభిఘాతముల నెవ్వడిఁ గ్రక్కదలంగ వచ్చి రిం
కేల "హతోఽస్మి"యంచు మదినెంచితి డించితి జీవితాశలున్.

ప్రాణభీతి గనుకఁ బాఱిలుమాలక యల్లె
నురువు దొబ్బలడర పరువులెత్తి
దూరినాడ నొక్క యూరి చేరువనున్న
కాళికాలయంబు గర్భమందు.

వెదకుచును వచ్చి వారలు వెలుఁగువేసి
దేవళము నంతఁ దడవి శోధించి రైనఁ
గాళి విగ్రహ పృష్ఠ భాగంబునంటి
యున్న ననుఁ జూడరైరి దైవోపగతిని.

అందఱి కన్నులం బొడిచి యంతు గనంబడకుండఁ బోయె నే
మందుము వీని జాణతన మక్కట యీ పవలెల్ల నిచ్చటే
సందులు గొందులన్ని వరుసన్ బరికించినఁ గానరాఁడె యి
ట్లిందఱమూరకే చనుదమే యొకబాలునిఁ బట్టలేకిఁకన్.

అనుచు వారలాలయము నిర్గమించి త
త్పరిసరముల వెదక నరిగి రేను
వెలికివచ్చిచూడ వెలవెల్లనగుచుండెఁ
దూర్పు, జనముసాగెఁ ద్రోవనడువ.

మెల్లగఁ బైకిఁ బ్రాఁకి గుడిమీఁది విమానము బొమ్మకట్టులో
నల్లననక్కి మల్లురగతాగతముల్ పరికించుచుంటి వా
రెల్లరు నేవియో సయిగ లేవొ రహస్యము లాడుకొందు రా
పల్లెకుఁ బోయివత్తురెవొ ప్రశ్నలు వేయుదు రేగుపాంథులన్.

ఆరెకులట్లు ప్రొద్దు చరమాచలభూమికి వ్రాలుదన్కనా
చేరువలందె నిల్చి పరిశీలనచేయుచునుండి రప్పుడా
హారములేక నాటినిశియంతయు మేల్కొని యుంటఁ జేసినే
కూరుకువచ్చి మైమఱచి కొంచెము కన్నులుమూసినంతనే.

ప్రాణమెటువోయెనో పైనఁ బైరగాలి
కచట గాఢనిద్రాదేవి యావరించె
మేనికొరపిడిదగిలి నే మేలుకాంచి
కన్ను దెఱవంగఁ జీఁకటి గ్రమ్మియుండె.

గ్రుడ్డివెన్నెలలోన నాకునిరుగడలఁ
జేరి మొగమున మొగములు సేర్చి తొంగి
చూచుచున్నట్టి భీకరసూకరాస్య
కలితములు రెండుభూతముల్ గానఁబడియె.

వానిఁ జూడగానె భ్రమమొంది నా గుండె
పచ్చికుండమాడ్కి విచ్చిపోయెఁ
గెవ్వు కెవ్వుమనుచుఁ గేకలు వైచితి
బోరుకలఁగి బయలు మాఱుమ్రోయ.

ఆ రొదకుఁ బ్రేతములు రెండు నదరిపోయి
తట్టుముట్టాడుచును నట్టె ధరకు దూఁకి
తిరిగి నైనను జూడ కా సరసనున్న
పాడు మసనంబులోనికిఁ బాఱఁజూపె.

అంతట లేచి నేను విధియాగడమున్ దలపోసి దూఱి ప్రా
ద్దెంత గమించునో యని పరీక్షయొనర్చితి నెవ్వ రచ్చ టా

ప్రాంతమునందుఁ బూరిపుడకైనఁ జలింపఁ దిఁకేమి మీఁదికిన్
గొంతుకయెత్తిచూడఁ గొఱుకొయ్యలుగ్రుంకుచునుండెనప్పుడే.

ఆ నడికిరేయి దేవాలయంబు డిగ్గి
మఱలిచూచుచుఁ బెడత్రోవ లరసికొనుచు
బాటనెవరైన నాకెదుర్పడినఁ జెట్ల
నీడ నొదుగుచుఁ బయనంబు నెఱపినాఁడ.

కాళ్లు కండెలుగట్టె మోకాళ్లు బిగిసె
నల్లె పరువులువాఱి యీయతిభయంక
రాటవీస్థలిఁ జొచ్చితి నపుడె చెంచు
గూడెమునఁ గొక్కొరోయని కోడిగూసె.

తెలతెలవేఁగుదాఁక నొకదిక్కునఁ గూనికిలేచి మెల్లగా
సలిలతలంబు లీఁదు చవిశంకట కుంజములందు దూరుచున్
బులుల నెలుంగులంగనుచు బుట్టలదాఁటుచు మిట్టలెక్కుచున్
సలిపితిఁ బైన మెంతకుఁ గనంబడదంత మరణ్యభూమికిన్.

అర్కుఁడపరాబ్ధి తటమున కరుగులోన
భయదగహనంబు దాఁటిపోవంగవలయు
నంచుఁ ద్వరపడి నడచితి నైనఁగాని
చిట్టచివరకుఁ జిక్కితి నట్టనడుమ.

పోవఁబోవ నింకఁ బ్రొద్దెదురాయె సు
మ్మన్నవిధముదోఁచె నంతకంత
కతికరాళమయ్యె నాకసంబంటిన
వృక్షచయముతోడ విపినభూమి.

చూచుచుండఁగనే యటుఁ జుట్టునున్న
ప్రబల తరుషండములు గానరాకపోయె
మిట్టపల్లాల తెలిఁగు గన్పట్టదాయె
మొత్తమాకాన చీఁకటిముద్దయయ్యె.

ఉదయగిరి కందరంబులో నుద్భవించి
సాగి సర్వసర్వం సహా చక్రమొక్క
సారిగా ముంచి పశ్చిమ సాగరంబు
వైపునకుఁ బాఱెఁ జీఁకటి వఱదలపుడు.

అంతట నిశ్చేష్టుఁడనై
స్వాంతము చెడి నిలువఁబడితి సరసనె యేదో
కాంతి గనంబడె దీపపు
బంతివలెన్ దానిఁజూచి భ్రమపడి నేనున్.

అది యొకానొక శబరాలయంబుగాఁగ
నెంచి పరువెత్తినాఁడ నే నేఁగుకొలఁది
నదియుఁ బోసాగె నంతట నచట నిలిచి
"యెవరు వారని" కేకల నిడితి గాని.

పలుకక నా సమీపమున బారెఁడు దూరములోనె రెండుగా
వెలిఁగి యనుక్షణంబుననె "పెద్దయి" పోయె నిఁకప్పుడక్కటా
తలఁపగనైతిఁబో కొఱవిదయ్యము లియ్యవి మోసగించె న
న్నిలువునఁ, నిట్టి వెన్ని గమనింపఁగనుంటినొ నేటికిచ్చటన్.

అని చింతించుచు నావలి
కిని జని యొక రావిచెట్టు క్రింద శిలా వే

దిని జతికిలఁబడి కన్గవ
కొనలన్ బాష్పములు మెండుకొన నేడిచితిన్.

అప్పుడె కారుమబ్బులు వియత్పథ మంతట నావరించెఁ బె
న్గప్పుడుతోడ సాగెను ఘనాఘన ఘట్టనగర్జితంబులున్
నిప్పులుజల్లినట్లు ధరణీవలయంబున కంటఁదీఁగలై
చొప్పడివచ్చుచుండె నెటుచూచినఁ గ్రొమ్మెఱుపుల్ దళంబుగాన్.

ధారిణీమండలంబు బ్రద్దలగునట్లు
ఫెళఫెళధ్వని దివినుండి పిడుగులడరె
దారుణావర్త నిర్భిన్నతరువరంబు
భోరుమని లేచెఁ బడమటి హోరుగాలి.

మెఱుపు మెఱసినయపుడెల్ల మింటినంటి
గాలికుఱ్ఱూఁతలూఁగు వృక్షములఁగన్న
నేమిసెప్పుదు నేడు ప్రాయేర్లదాఁటి
యవలి దీవులఁ జూచె నా యంతరాత్మ.

కన్నులరమోడ్చి శిరము మోకాళ్లమోపి
యురిమినపుడెల్ల బెగ్గిలి యులికిపడుచు
దైన్యదోదూయమానచిత్తమునఁ గ్రుంగి
కూరుచుండఁగ నొకచిన్న కూన్కువట్టె.

అంతలోననె బిందుసారా ! యటంచు
పిలిచిరెవ్వరో ముమ్మారు పేరువెట్టి
యిచట నన్నెఱింగిన వారలెవ్వరనుచు
విస్మయంబొంది కన్నులు విప్పిచూడ.

గణగణమంచు మ్రోయుమొలగంటలతో దిగుచుండెఁ జెట్టు నా పొణకువగట్టి యొక్క పెనుభూతము దానికనుల్ తనూనపా త్కణములు నోరుత్క్షోణిధరగహ్వర మమ్మక చెల్ల! చూచి నే వణఁకున దూలిపోవుచుఁ జివాలునలేచి గమింపసాగితిన్.

కన్నువాడుచుకొన్నఁ గానరానట్టి గా
ఢాంధకారమందు నదియు నిదియు
నెదురుకొట్టుకొనఁగ నెట్టకేలకు నొక్క
కూఁత పెట్టు దవ్వు గునికిపాటె.

అచ్చట నొక్క కుంజకుహరాంతరమందునదూరి “మీఁదికిన్ వచ్చిన గండమున్ దొలఁగబాపుటకై యశరీరవాణితో నిచ్చట నన్ను లేపెఁ బరమేశ్వరుఁ డాతడ కాఁడె నిత్య మా పచ్చయమందు మానవులపాలిటఁ బ్రోపయి నిల్చువాఁ డిలన్.”

అనుచు నమ్మహామహుని యవ్యాజకరుణ
కబ్బురంపడి కొంతసేపతని మాన
సాంబుజంబునఁ దెలచితి నంత నపుడె
కన్నులు జిగాలుమనఁగ నొక్కపరి మెఱసె.

ఆ మెఱుపుకాంతిలోపల
నా ముందఱఁగంటి దీర్ఘనఖసంచిత ము
ద్దామ ధ్వజదండాయత
మామూలము రక్తసిక్తమగు నొకచేయిన్.

అస్థివలయాంచితంబగు నా కరంబు
తడవుచున్నది నన్ను, నేఁ దల్లడిలుచుఁ

బొంచి పసివట్టి వచ్చిన భూతమని యె
ఱింగి పొదఁ జీల్చి వెలికిఁ దొలంగి దూఁకి.

పాతరలాడుచున్ జని గుభాలునఁ గూలితిఁ ద్రోవలోన పెన్
లోతయి పాడువడ్డ యొకనూత నిఁకేమివచింతు దేహ మా
పాతవిఘాతమయ్యె వినవచ్చె సమీప నికుంజకోటర
వ్రాతవిలీననిద్రదనివార్యభుజంగమభుగ్నఫూత్కృతుల్.

కొనకు నీబావి లోవలఁ గూల్చిచంప
గండములనెల్లఁ దప్పించి గాచినావె
దైవమా! యంచు నాచుట్టు దడవుకొనఁగఁ
దగిలెనాచేతికేదో చేఁత్రాడుపోల్కి.

దానిఁగొని పైకిఁబ్రాఁక యత్నంబుసేసి
పడితి లోనికిఁ బలుమార్లు పట్టువదలి
మొండిపీనుఁగ నగుటచే మొత్తమునకు
నెట్లొ తెలవాఱుసరికి గట్టెక్కినాఁడ.

పైకరుదెంచిచూడఁ గనుపట్టెను రజ్జువుగాఁ దలంచి నేఁ
జేకొని యెక్కినట్టిదొక జిహ్మగరాజొఱఁబట్టియుండె నా
భీకరసర్పమున్ వదలిపెట్టి "యహర్ముఖమందు నేఁడు నే
నే కుటిలాత్మమోముఁ దిలకించితినో శివగండమంతటన్."

అని భయమున నేకారుచు
జనుచుండఁగ నొక్కసరసి సన్నిధి ముఖమా
ర్జన మొనరించెడి కొందఱు
ననుఁగని సంతోష మానసంబులఁ దోపన్.

ఇతఁడొక రాజబాలుఁ డెటకేఁజనుచుండెను రండురండు స
మ్నత శుభలక్షణంబులు సమస్తము మేననెసంగఁ జండికా
సతికి బలిప్రదానము నొసంగుట కీతఁడె యర్హుడంచు ను
ద్ధతి ననుఁ బట్టవచ్చి రడిదంబులు గైకొని భీకరంబుగన్.

పాముఁ దప్పించుకొని పోవ గాము వెంటఁ
బడిన తెఱఁగాయె నేమి యీ పాపమనుచు
వారికందక పర్వులువాఱి యిచట
నీ పదంబులఁగంటి మౌనికులచంద్ర!

దిక్కు లేనట్టి పక్షినై కక్కసమున,
నావటిలు నన్నుఁ బ్రోచి పుణ్యమునఁ బొమ్ము
అని మహీవర పుత్రకుఁ డాత్మగాథ
విస్తరింపఁగఁ దలయూఁపి విని యతండు.

పాపము చాలకష్టములు పైబడె దానికి నేమిలెమ్ము నా
ప్రాపు లభించె నీకొక యపాయము లేదిఁక రమ్మటంచు నా
దాపునఁ గట్టియున్న తన దర్భకుటీరముఁ జేరనేగెఁ ద
ద్భూపకుమారుఁడున్ జనియె మోమున దైన్యము వెల్లివాఱఁగన్.

ఏగిచూడనచట నిట్టివారలె కొంద
ఱాశిఖానఖాంత మలమివైచి
బూదికుప్పలనఁగఁ బొలుపారుచుండిరి
జింకచర్మముల నశంకితముగ.

ఈ ముని వారలతో నే
దో మంతనమాడిచెప్పి నూఁకొని వా రే

మేమో గుసగుసలాడిరి
మోమున మోములు గదించి మోదంపడుచున్.

తపసులిద్దఱులేచి యాదారకునకు
స్నానమాడించి రక్త వస్త్రానులేప
నములఁగై సేయఁ దొడఁగిరా క్రమముసూచి
బిందుసారుండు సంశయావిష్టుఁడగుచు.

* తెల్లవాఱెడివఱకును దిరిగితిరిగి
ఘట్టకుటిఁజేరు పాంథుని గతియెసంగె
నేమి? నాకునేఁడని నిదానించి వారి
యందఱిమొగాలు పరికింప నప్పుడచట.

ఉదయమునందు నా కొలనియొడ్డునఁ దన్నదలించి పట్టుకో
సదమదమై ప్రయత్నములు సల్పినవారొక రిద్దఱున్న య
ల్లెదగమనించెఁగాని యిఁకనేమి యొనర్చుఁ గటార్లబోనులో
గుదిరినయట్టు లెంచుకొనె గువ్వయి కూలఁబడెన్ దిగాలునన్.

గజగజలాడు మాణవకుఁ గాపథవర్తులు తాపసాధముల్
"గజబిజినొందఁబోకు"మని కమ్మనిమాటల బుజ్జగించి యా
రజముగ గన్నెరుంబువుసరంబులు వేసి యతండు వెంటరా
విజనములోని కోవెలకు వెళ్లిరి దుర్గకుఁ గాన్క వెట్టఁగన్.

* ఒకఁడు తెరువుపన్ను (ఆసీలు) కట్టవలసివచ్చునని రాజమార్గము వదలి దొంగత్రోవను బోయెను. గాని త్రోవ తెలియక రాత్రియంతయు పట్టణమందే యటునిటు దిరుగుచుఁ దెల్లవాఱుసరికి దైవికముగా నాపన్ను వసూలుచేయుచోటికే వచ్చెను. అపుడు పన్ను కట్టక తప్పదాయెను. శరీరశ్రమను బడెను. దీనినే ఘట్టకుటీప్రభాత న్యాయమందురు.

వెడఁగు జడదార్లు త్రోపాడ వెక్కి వెక్కి
యేడ్చుచును బిందుసారుఁ డాయెడకుఁబోయి
చూడఁ గనిపించె జగములఁజుట్టిమ్రింగ
నున్నగతి జిహ్వఁజాపిన యుగ్రకాళి.

దానిఁ గనుగొని యతఁ డెంకఁ దనకునపుడె
నిశ్చయము సేయఁగాఁబడ్డ నిర్జరేంద్ర
నగరయాత్రావిధాన లగ్నంబు చేరు
వ యయి, వచ్చినట్లెటేఁగె భావంబులోన.

అన్నిగండాలఁ గడపిన యాదయాళు
వైన భగవానుఁ డాతనియందు లేక
పోవఁ డపుడైనఁ, గాని తద్భ్యాపపుత్రుఁ
డెంత యల్లాడెనో యట నెన్నవశమె.

—

# భూతతృప్తి

## బీభత్సము

శోణితనదీప్రవాహముల్ చుట్టుకొనిన
పాలికలను చూడ మిఱిమిట్లు గొలుపుచుండె
ఘుసృణమాంజిష్ఠకంకేళికుసుమగుచ్ఛ
బాంధవంబైన జరఠాతపంబులోన.

సైంధవునిచావుతో నట సమరమాపి
తొలఁగిచనె నిరువాగుసేనలును నంతఁ
బూరిపుల్లయుఁ గదలదు వీరరుధిర
మోడ్చి కదనాంగణము కన్నుమోడ్చె, నపుడు.

జయజయ మహావీర! జయ మేరుధీర!
జయజయ పృథాపుత్ర! జయ శత్రుజైత్ర!
ఘనభుజాబలదర్ప! గాండీవధన్వ!
బ్రహ్మాయువిడు నీకుఁ బరమేశ్వరుండు
నీ కతంబునఁగాదె నేఁడు మా యిండ్లు
పచ్చబాఱిన వింతపాఁడిపంటలతో
అని పెద్దపెట్టున నార్చుచున్ దిగియె
బెలబెల దివినుండి పెక్కుభూతములు.

దిగినతోడనె యందొక్కటెగిరి యపుడె
యసువులూడ్చెడి గుఱ్ఱంబు నడఁచిపెట్టి
పొట్టఁ జీలిచి దోసిళ్లఁ బట్టిత్రావెఁ
గటికిరక్తంబు సెలవులఁ గాఱిపోవ.

నిగనిగలాడు నొక్క ధరణీవరు మేనికి నై పిశాచముల్
తెగఁబడి పోరఁగాఁ దుదకుఁ దేలిన పర్యవసాన మేమనన్
సగము హరించిపోయినది సందడి కయ్యములో నలంగి యా
మిగిలిన దాని నొక్కపరి మ్రింగె నొకండితరంబు మోదినన్.

త్రావినంతఁ ద్రాగి తరువాత నొక భూత
మింటి ముసలిదాని కిత్తుననుచుఁ
బునుక లేరి తెచ్చి పొర్లిపోవఁగఁ బట్టె
నురలిపాఱుచున్న యుడుకునెత్రు.

ఒక్కటి గేస్తురాలికి గజోత్తమ కుంభములోని క్రొవ్వు కం
డక్కటికంబుతోడ వదనాంతరమందునఁ బెట్ట నద్దియున్
గ్రుక్కలు మ్రింగుచున్ నమలి కొంతరసం బెదుకీఁదు చొల్లుతోఁ
గ్రక్కెను దానినంతయును గైకొని త్రావె నిఁకెంత ప్రేమమో.

బలము గలుగు వాని ప్రక్కనుండఁగలేక
బడుగు భూతమొకటి వెడలిపోయి
కొఱికి తినఁదొడంగెఁ గుళ్లువాఱిన ప్రాత
సబములందుఁ జేరి జాలిగదుర.

రక్త గంధానులేపంబు రాచి క్రొత్త
పెండ్లికొమరుండ నేనని వెడలె నొకటి
ప్రేవు జందెంబు దగిలించి పెండ్లిసేయ
నీకుఁ బౌరోహితుఁడనని నీలె నొకటి.

ఎంతటి మంచిదో కురుమహీశ్వరు మానస మింతగూర్చె, మ
న్వంతరముల్ సహస్ర మతఁడాయువుగల్గి వెలుంగుఁగాత మం

చెంతయు సంతసించుచు నరేంద్రవసాకలితోపదంశ మ
త్యంత సుఖంబుగూర్ప నొకటానెఁదురంగము రక్తమద్యమున్.

పొలసు కొఱకేడ్చు పిల్లల బుజ్జగించెఁ
దల్లి భూతంబు "కౌరవధాత్రివిభుఁడు
చల్లగానుండవలెగాని జగతిలోన
మాంసమున కేమి తక్కువ మనకు"ననుచు

కటికితనంబులోన లయ కాలుఁడు చాలడు నాకు మీర లే
మిటికిటు చూచుచుంటిరి నిమేషము లేదియటంచు నొక్కఁడా
కుటిలనఖాగ్రకోణములఁ గ్రుచ్చి మహీంద్రకనీనికావళుల్
పెటుకు పెటుక్కనన్ బెఱికి పేలపు గింజల పోలికన్ దినెన్.

సైంధవుని గుండెఁ దిను పిశాచమునుద్రోసి
మఱియొకటి మెక్కుచుండెఁ గ్రమంబుదప్పి
యంత నిరుప్రక్క భూతముల్ పంతమాడి
క్రుమ్ముకొన్నవి దమలోన, దుమ్మురేఁగ.

మంచిగుణంబులు గలదొక
టంచితముగ ముసలివాని కందించెను హ
స్తాంచలమున మాంసాస్ర
గ్సంచిత కుంభముల, నెందు సరసులు లేరే.

ఈ గతి నాటివేళఁ దమ యిష్టమువచ్చినయట్లు భూతముల్
మూఁగి భుజించెఁ గంతములు మోవఁగ బీన్గుల, నేటికల్లె యే
లాగుననైన మెక్క నుబలాటముఁ జెందును గాని యా మహా
భాగులు కౌరవేశ్వరునివంటి నృపుల్ జనియింప రైరిఁకన్.

---

# చైత్రపూర్ణిమ

## అద్భుతము

చైత్రపూర్ణిమనాఁడు నిశాముఖంబు
నందె భుజియించి యింటికిముందునున్న
యారుబయటఁ బరుంటి నా యవసరమునఁ
బుచ్చపూవంటి వెన్నెల హెచ్చుచుండె.

తెల్లని చంద్రబింబము నదేపనిగాఁగనుగొంటి నంత నా
యుల్లమునందుఁగోర్కి యొకడుద్భవమయ్యె నహాగమించి యా
చల్లనిమండలంబున విశాల పథంబులయందు శాంతిసం
ధిల్లఁజరించు భాగ్యమరుదెంచిన బాగగుఁగాదె యం చిఁకన్.

క్రొన్నెలచల్వకున్ గడుసు కోయిలకేకకు మందమందమై
కిన్నెరమ్రోఁతతోడఁ దులకించుచుఁదోలు సమీరపాళికిన్
గన్నులు మూఁతవడ్డవి సుఖంబుగఁ గూర్కితి నప్పుడెప్పుడున్
గన్నదిగాని యొక్క కలఁగంటి విచిత్ర కథామయంబుగన్.

రాజద్గాంగతరంగసంఘముల సంరంభంబుఁ బోనాడి స్వ
ర్భాజస్వచ్ఛగుళుచ్ఛ కాంతులకు సొంపుల్ సూపి యేలాలతా
రాజిన్ ధిక్కృతులాడి మొల్లలకుఁ దోరంబై మహాశాంతమై
తేజంబొక్కటి చేరవచ్చె భువికిన్ దేదీప్యమానంబుగన్.

గుంపులు గుంపులుగాఁ బ్రజ
లింపగు నా కాంతి యేడ దేమని హర్షో

త్కంపితులై గనిరి నిదా
నింపఁగ దేవర్షి యన్న నిర్ణయమూఱెన్.

జానులంబిపిశంగ జటల యూఁపునఁబుట్టు
మందానిలంబుల మహతిమ్రోయ
పాండర దేహ ప్రభాభాసములఁజుట్టు
వస్తువు లద్వయావస్థనొంద
మిన్నేటి యిసుకతో మెఱుఁగు వెట్టిన తామ్ర
జలభాజన మొకింత జాజునింపఁ
గరమునఁ గైకొన్న కలికి మందారంబు
వాసన కెలదేఁటు లాసఁజేయ

నారదస్వామి యేమి యీనాఁడు భువికి
వచ్చుటేమని యాశ్చర్యభరితమాన
సమున నేఁజూచుచుండ నాక్షణములోన
నమరమునిచంద్రుఁ డెదుటఁ బ్రత్యక్షమయ్యె.

ఆ దివిజమౌనిఁజూచిన హర్ష మొదవె
భయము మొనసూపె నేలన నియత కలహ
పారణుఁడు గాన నాకు నెవ్వారితోడ
సంఘటింపంగ వచ్చెనో సమర మనుచు.

సాగిలిమ్రొక్కి మహాభా
గా! గమనశ్రమమునోర్చి కరుణించితె యీ
లాగున నన్నని వేఁడుకొనం
గాఁ గని ముని మందహాసకలితుండగుచున్.

ఓయి కుమార! నీకుఁగల యుత్తమవాంఛ నెఱింగి తీర్పఁగా
నీ యెడ కేఁగుదెంచితిసరే గయికొమ్మివి యోగవాగ ల
త్యాయత మేతదీయమహిమావళి వీనిధరించి నీవనా
పాయముగాఁ జరింపనగు నంతట నొక్కక్షణంబులోపలన్.

అని యొసఁగి యంతలోననె
కనుమొఱఁగి మునీంద్రుఁ డరుగఁగా నాకపుడే
మనమున స్ఫురణకువచ్చెను
మునుప్రవరుని గాథ, గాని ముసరెడి కోర్కెన్.

బ్రహ్మముని యిచ్చిపోయిన పావుకోళ్లఁ
గాళ్ల ధరియించి నేను మేఘంబులుండు
మండలమునకుఁ బోవంగ మనసుపడితి
నంత నిఁక నేమిసెప్పుదు నద్భుతముగ.

రివ్వునలేచి యంబరదరీముఖముల్ మొఱయంగ నేగి దా
దవ్వులఁ జూచితిన్ మొదట దానికిఁ బిమ్మట ముందె జిల్లెడుం
బువ్వులరీతిగా నెగిరిపోయెడి మబ్బులగంటిఁ గోరుకుల్
నివ్వటిలంగఁ గొంతవడినిల్చి తదేక సమీక్షసేసితిన్.

నల్లని తెల్లని మొయిళులు
మల్లడిగొని పరువులెత్తు మార్గముగన నా
యుల్లమున నేనె వెనుకకు
వెళ్లినగతిఁదోచె వాని వేగముకతనన్.

అట్టు లరయుచునుండ నా యెట్టయెదుటఁ
జారుతరమూర్తి యొకఁడు సాక్షాత్కరించెఁ

గొన్ని చిన్నెల బట్టి మేఘుండటంచు
వానినెఱిఁగితి నతఁడట్లు గానిపించి.

అబ్బాయీ! యెందులకీ
మబ్బులలోఁ దిరిగెదీవు మాను మపాయం
బబ్బు నబింధనవహ్నులు
గుబ్బటిలు నొక్కొక్క వేళఁ గొండలువగులన్.

తెలియక నిలిచితివేమో
తొలఁగుట శుభమంచు నెనరుదోఁపఁ బలుకనేఁ
దలఁకక యేమండీ! యీ
జలదంబులు సంభవించు సరణియదెట్లో.

తెలుపవె నాకని యడిగిన
నెలనవ్వొలయంగ నాతఁడిట్లనువత్సా!
జలధరము లుద్భవించెడి
వలనెఱుఁగన్ మనసులోన వాంఛించితివే.

అరయఁగాలేదె బాల్యంబునందుఁ గాళి
దాస విరచిత మేఘదూతంబునందు
*సలిల ధూమాగ్ని మారుత సన్నిపాత
మంబుదంబన్న విషయ మీవంతెసుమ్ము.

అన నే నింకొకటడిగితి
ఘనుఁడా! మేఘంబు లరిగి కడలిని సలిలం

---

* ధూమజ్యోతి స్సలిల మరుతాం సన్నిపాతః క్వమేఘః

బును ద్రావు నందురే యది
యను సత్యమె ? చెప్పుమన్న నూఁకొని యతఁడున్.

వినుమిటుసౌమ్యుఁడా ! తపనువేఁడిమయూఖములందుదప్తమై
వననిధి వారి వాయుగతిఁ బైకిగమించి పయోధరంబుగాఁ
దనరి జలంబులం గురియుదానినె మానవులబ్ధిలోనికిన్
జని యుదకంబుఁద్రావును ఘనంబని వాకొనుచుందురారయన్.

అది సరియెకాని నీవింక నాలసింప
కవలి కేగుమ యంచు నా యలఘు పురుషుఁ
డచట మటుమాయమయ్యె నేనంత నొక్క
నిమిషమాత్రాన ◆ ఛాయాపథమున కేగి.

ఆ సువిశాలమార్గమున నావల నీవల గడ్డిపట్టులన్
మేసెడి జింకకూనల గణించుచుఁ బుష్పితచూత శాఖలన్
గూసెడి గండుకోయిలల కూజితగీతము లాలకించుచున్
గాసెడి చంద్రికాతపవికాసమునెన్నుచుఁ బోవఁబోవఁగా.

వెన్నువిడిచిన యొక పచ్చజొన్న చేని
లోన నొడిసెలతో మంచెపైన నిలిచి
వ్రాలవచ్చెడి పక్షులఁ దోలుచున్న
వెలఁది నొకదానిఁగంటిఁ గన్వేదురెసఁగ.

చక్కనిముక్కుజానయిన సంపెఁగ, యింపెగఁజిమ్ము జాళువా
రెక్కలు చెక్కు, లమ్మొగలిరేకులనాకులపెట్టు గోళ్లు, వ్రే

---

◆ మింట వరుసగాఁ గనుపట్టు త్రోవవంటి తెలిరేకలు.

ళ్లక్కట ధిక్కరించుఁ జిగురాకుల, నేకులమో పడంతిద
మ్మక్క! తళుక్కుమన్నది వియన్నదిపూరమువంటి వెన్నెలన్.

కాంత యొయ్యార మరయ శాకుంతలమునఁ
బట్టి పెంచెడి యుపవనవల్లికంటె
లలితమై యొప్పు నారణ్యలతయె యన్న
*శ్లోక మొక్కటి నామదిలోనఁ దోఁచె.

అంతనచ్చోటు బాసి నేనవల కొంత
దూరమరుగంగఁ ద్రోవలోఁ గూరుచుండి
ధేనువుల రెంటి మేఁపుచుఁ గానిపించె
నేండ్లు సెల్లి పండిన శతవృద్ధొకండు.

తనువుముడిఁగెను వలిఫలితములచేతఁ
గనులతెప్పలతోఁ గూడ జనపనార
కరణిఁ దెల్లగా నఱసె వంగఁబడిపోయె
జీవనాళంబులన్నియు జీర్ణమగుట.

ఆతనిసరసకుఁ జని నే
తాతా! యెఱుఁగుదువె యీ పథంబెచ్చో ను
ద్భూతమయి యెచటికేగునో
నీ తెలిసినయంతవఱకు నిక్కముఁ జెపుమా.

అని యడుగ ముదుకఁడు తన యాననంబు
నెత్తి వడఁకెడి చేయి నొకింత దృష్టి

---

* శుద్ధాంత దుర్లభ మిదం వపు రాశ్రమవాసినో యది జనస్య
దూరీకృతాః ఖలు గుణై రుద్యానలతా వనలతాభిః

కడ్డుగావించి నా మొగంబట్టిచూచి
"యెవరురాబాబు! నీవు నే నెఱుఁగ కేమి."

*కాశీ రామేశ్వర యా
త్రాశయులగు మునులు నడువనైనది యిది యా
కాశమున మీ పితామహి
యీ "శాస్త్రముఁ" జెప్పలేదె యెప్పుడు నీకున్.

అనిన నా కప్డు స్ఫురణకు నరుగుదెంచి
వృద్ధుఁడా! పాండవుల గోవులీ తెరువునఁ
బోవుననికూడఁ జెప్పెడి దా విధమునఁ
జనుచె యెపుడైనఁ గంటివె యన నతండు.

అయ్యో యిప్పుడులేదుగాని మునుప్రాయంబందు నేనుండ బా
బయ్యా! ధర్మజు నాలమందలిటుగా నాకాశ గంగానదిన్
దియ్యంబైన జలంబుఁగ్రోలి తటి నీ తీరంబులన్ గుంపులై
నెయ్యంబారగ మేసిపోయెడివిలే నిత్యంబు మే మారయన్.

అని వచింపఁగ నే నప్డు డతనితోడ
వృద్ధుఁడా! బ్రోవఁ బుత్రకు లెవరులేరె?
కాటికిని గాళ్లుసాపితి వేటికింక
నాలమేపుచు నడియాస నలయుదీవు.

రామా! కృష్ణా! యనుకొను
చేమాత్రమొ కుడిచి యింటనే యుండఁగలే

---

*అనభిజ్ఞులైన పల్లీవృద్ధులు పిల్లలకు ఛాయాపథ విషయమునఁ జెప్పు కట్టుగాథ లనువదింపఁబడినవి.

కీ ముసలితనములో నీ
కేమిటి కీ యలఁత యనఁగ నిట్లను నతఁడున్.

నాయనా! యంతభాగ్యంబు నాకుఁగలదె
బ్రతుకులున్నవె యీరీతిఁ బాటుపడినఁ
గాని చివరకుఁ గోడలిగారి క్రింద
గొడుకునకెలేదు "పార"యింకడుగనేల.

ఇట్లు చెప్పుచునుండఁగా నింతలోన
మొలకజవ్వనమందున్న ముగుద యొకతె
గల్లుగల్లున నాత్రోవ వెళ్లుచుండె
దానిఁగాంచి ముదుకఁడు మందముగ నగుచు.

ఏమే పిల్లా! యెచటికి
నామనుమఁడు సత్కరించునా? సరిగా ని
న్నేమఱక యనినఁ గోమలి
మోమున రోషంబు లజ్జ ముసురుకొనంగన్.

వయసు సెల్లిపోయినఁగాని "పలుకు"మాత్ర
మింకఁ జావదు కనుకనే యెఱిఁగి కోడ
లావిధంబున మాడ్చు నట్లైన సిగ్గు
రాదుగద నీకు ననుచు మార్గమున నరిగె.

మఱల నే లేచి హరిణాంక మండలంబుఁ
జేర నరిగితి నద్దాని చెంత కేగు
కొలఁది మితిమీరి పెరిగి నట్లలరె, లోన
నినుము మొలకెత్తు రీతిగా నివతళించె.

ఆ తీయని వెన్నెలలో
నాతలుగని బయళులందు నభిరామ హిమ
వ్రాత కిలికించితంబులు
చేతస్సున కింపఁదిరిగి చెన్నగునడుమన్.

బంగరుపూలు మేనఁ జెలువంబొనగూర్ప మణీమయంబులౌ
శృంగము లిందుకాంతుల గ్రసింపగ నచ్చట మేయు నాదిసా
రంగముఁగంటి నద్భుతతరంబగు దానిబెడంగు చెప్పఁగా
లొంగదు వాఙ్మయంబున కలోకమమేయ మనుత్తమంబు సూ.

పొసఁగి ప్రతిఫలించు భూచ్ఛాయఁ గనుగొంటి
నచ్చమైన పుట్టుమచ్చఁగంటిఁ
గూరుచుండియున్న కుందేలుఁ జూచితి
మరగితిరిగి చంద్రమండలమున

పొన్నమ్రానిక్రింద సన్ననూల్ వడికెడి
పేదరాలినొక్క పెద్దయమ్మఁ
గాంచినాఁడనామె కఱవును గాలంబు
కన్నులారఁ జూచియున్న యవ్వ.

చెంగటికరిగినఁ దాతయ
సంగతి యేమైనఁ జెప్పఁజాలెడిదేమో
గంగాతుంగ తరంగము
లం గలిగెడి మ్రోఁతమనను లాగబిఱానన్.

అటఁజని కాంచితి వీచీ
చటులస్ఫుట నాదపిహిత సర్వాంబర, ను

త్కటతట నిర్భేదనవాః
పటలఝరీనటిని, విష్ణుపదభవతటినిన్.

ఝుమ్మని తమ్మిపూఁబొదలసందునఁ బాఱు మిళిందపఙ్క్తిపా
తమ్ములరాలి యారజపుఁదావులఁ జిమ్ము పరాగధూళితోఁ
గమ్మని కన్నగాడుపు లెకాయెకి నాకెదురై ప్రయాణ జ
న్యమ్మగు శ్రాంతి బోనడఁచె నా త్రిదివాపగ తీరభూములన్.

మందానిల హాల్లోహల
సందర్భ సమాత్తపులక సత్త్వుఁడనై యా
యిందుధర మౌళిమాలకు
మందాకిని కెరఁగి భక్తిమయ హృదయముతోన్.

వనజనాభుని లోక వందిత పాదంబు
జన్మదేశము నీకు సన్నుతాంగి!
చంద్ర చూడుని జటాసాంద్ర కలాపంబు
భర్మ హర్మ్యము నీకుఁ బాపరహిత!
సత్యలోకంబాది సర్వస్థలంబులు
పూలతోఁటలు నీకుఁ బూతచరిత
పుణ్యతరంగిణీ పూగంబులోనెల్ల
మేలుబంతివి నీ వమేయశీల

నియతి నే మానవుండైన నిన్నుఁ గన్న
స్నానపానార్థముగ నీదు జలముఁగొన్నఁ
గుటిల యోనుల నింకఁ బుట్టుటలు సున్న
కమలమృదుపాణి! దివిజ గంగాభవాని!

అనుచు నుతియించి యవలికి సరిగిదాని
పులిన భూముల వెంబడిఁ బోవుచుంటి
వేఁగుజామయ్యె నప్పు డా వెన్నెలలకు
మందమలయానిలములకు మనసుగరఁగె.

ఏటికి నీటికై వెడలి రిందునిభాస్యలు నాకవాసినుల్
హాటకకుంభముల్ కటితలాంసములందు వెలుంగుచుండె, నా
బోటుల కేశపాశములఁబొల్చు పరిశ్లథ పారిజాతముల్
మాటికిఁ జిమ్ముచుండె విసుమానముగా నిబిరీసవాసనల్.

పూవుఁబోణులఁ గనుఁగొని దేవనగరి
యటకు దగ్గఱగానుండ నౌనటంచు
హర్ష విస్ఫారితాక్షుఁడనగుచు నగుచుఁ
గలయఁ బరికింపఁ బూర్వదిక్తలమునందు.

కాంచితిఁ గల్యగంధవహకంపితకింకిణికాకలీరవ
ప్రాంచితగోపురధ్వజవిరాజిత మధ్వరపూర్తసత్క్రియా
సంచితపుణ్యసాధ్యము, లసన్మణిమందిరసుందరప్రభా
వంచితహేమభూమిధరభర్మవికాసము, దేవవాసమున్.

వరుస బంగారువర్ణాల వైజయంతి
యని విమానాగ్రమున వ్రాయనలరునట్టి
హరిహయుని మేడఁగంటి నేనంత నగరిఁ
జూడఁదలపోసి మెల్లఁగాఁ జొచ్చుచుంటి.

కొమరుఁ బ్రాయంపు సొబగునఁ గులుకుచున్న
దివ్యపూరుషుఁడొక్కఁడే తెంచి యప్పు

డెటకుఁబోయెదు మానవు లిచటుఁ జేర
రాదు పో పొమ్మటంచు నిరాదరముగ.

పావాలులాగుకొని యతఁ
డావలికిని ద్రోసిపుచ్చె నడలుచు నంతన్
భూవలయమందుఁబడి నే
నావెనుకన్ మేలుకొంటి నద్భుతమెసఁగన్.

---

# దైవ దర్శనము

## శాంతము

శాస్త్ర పఠనార్థమై మున్ను సలిపినాఁడ
రేయుఁ బవలును బూర్తి పరిశ్రమంబు
నాల్గువర్షంబు, లాపైన నా శరీర
ముగ్ర రోగార్తమై బాధలొందె నవసె.

అంత వైద్యులు సెప్పు రాజౌషధముల
నెల్లఁ దెప్పించి సేవింప నించుకైన
స్వాస్థ్యమొందక రెండు సంవత్సరములు
కూరిర రుజ వాతఁజిక్కి వేసారిపోతి.

వ॥ ఆహారహంబు నాచే నుపయుక్తంబులైన మహౌషధంబులు మందునియందుఁ బ్రయోగింపఁబడిన విద్యాశిక్ష పోల్కి గుణాగుణంబులు సూపకయే వితపోయె–"భవితవ్యతా ఖలు బలవతీ". దినదిన ప్రవర్ధమానమైన మానసిక చింత మూర్తీభవించి యెదుటఁ దాండవింపసాగె.

ఏరూపంబున దీనిఁగెల్తు నిట మీఁదేవైద్యుఁ జింతింతు నె
వ్వారిం జేరుదు నెవ్వరడ్డమిఁక దుర్వారంబు నీ రోగమున్
వారింపంగల వారలెవ్వ రఖిల వ్యాపార పారాయణుల్
లేరే మ్రొక్కెదదిక్కుమాలిన మొఱాలింపన్ బ్రపుణ్యాత్మకుల్.

వ. అని యొకింత మాఱురూపంబునొంది భాగవతపద్యంబయ త్నంబుగా నానోట వెడలఁజొచ్చె, నవినాభావంబున నిత్యంబు కరంబుఁ గరంబలంకరించు గ్రంథంబులకు నాకు దూరం బాయె. లౌకిక విషయచర్చలంతగా రుచింపమింజేసి దినం బులు నాపాలిట దుర్దినంబులయ్యె. యామవతులాయామ వతులయ్యె. మకరంద మాధురీ ఝరంబులు స్రవింపఁ గవితాగానంబొనర్చు కోకిలపోతంబునకు వర్షర్తుప్రాప్తి యయ్యె. శాస్త్రంబుల నభ్యసించి జగత్తునేమో దలక్రిం దొనర్ప నూహాజాలంబు వన్నిన మానసంబునకు సర్వంబు శూన్యంబుగాఁ దోచె నహా! దైవఘటన, "విధిర హోబల వానితి మేమతిః"

ఆరని దుఃఖసాగరమునందుఁ గలంగుచు నొక్కవేళ నా హారముమాని మానసికమైన మహావ్యథతోఁ బరుండఁ గ న్నీరుదొరంగ నేడ్చి జననీ సహజాతలు తండ్రితోడ నా తీరువచించిరంతఁ బితృదేవుఁడు నన్ బొడఁగాంచి యిట్లనున్.

ఏలకుమార! దైన్యమున నీవిధి రేఁబవలున్ గృశింపఁజా ల్చాలునుధైర్యమున్ విడిచి జాల్మని భంగిదురంతచింతచేఁ దూలుటపాడియే మనకుఁదోడయి నిత్యముఁబ్రోవ వేణుగో పాలుఁడులేఁడె నీకొక విపత్తుజనింప నతండుసైచునే.

వ. నీకుఁ గాలంబుచెడ్డదౌట నిప్పుడిది సంభవించె, నాపదలిలు గట్టుకొని యుండ నేరవు. "నీచైర్గచ్ఛత్యుపరిచ దశాచక్రనేమి క్రమేణ" కాక మయూరుండు సూర్యునుపాసించి కుష్ఠంబు

వాపుకొనఁడే, వేంకటాధ్వరి లక్ష్మీసహస్రంబుఁజెప్పి పోయిన నేత్రంబులు దెప్పించుకొనలేదే; భగవత్ప్రసాదలబ్ధంబైన నీవాక్కు జగన్నాథు నుతికి వినియోగింపు మహౌషధంబుల నాపుము "మంత్రోహ మహౌషధ"మ్మనిక దాగీతాసూక్తి; లేక తలఁచెంచి మనకు నిలువేల్పయిన వేంకటగిరినాథు నొక్కసారి సేవించిరమ్ము దానసర్వారిష్టంబులు దొలంగు, నిదివఱకే నే నెన్నిసారులో చెప్పియుంటిఁగాని నీ వేదియు నాచరింపవైతివి. దైవంబునందు నీకీ యవిశ్వాసంబేల వొడమె? మదుక్తంబనుష్ఠింపకున్న నేనేమిసేతు నీ దుఃఖంబుఁ జూచి సహింపఁజాలనైతినని విసుఁగుకొన్న, దీర్ఘచింతా వ్యాకులితంబైన నా స్వాంతంబున కా పవిత్రవాక్యంబు లప్పుడంతగా రుచింపకపోయినను, మహర్షి కల్పుండైన జనకు నానతిమీఱంజాలక షాణ్మాసిక కేశదీక్షవహించి,

సరిగ ఖరనామవత్సర చైత్రమాస
బహుళపక్షంబునందు నే బయలుదేఱి
సంజ నిడుబ్రోలులో ధూమశకటమెక్కి
యుదయవేళకు గూడూరుఁ గదియనేగి.

గూడూరుసంధి దిగి కా
ట్పాడునకుంబోవు బండిపైనెక్కి యిఁకన్
వాడలఁ బల్లెల నడవుల
బీడులఁ గనుఁగొనుచు మిగుల వేడుకపడుచున్.

వ. చనుచుంటి యాత్రికులు బండి జాలమార్గంబుల వెంట శిరస్సులు వెలికిసారించి ప్రకృతి చిత్రంబులఁ జూచుచుఁ

బరస్పరంబు చెప్పుకొను చుండిరి. బాలసూర్యాతపంబు చుట్టుగనుపట్టు పర్వత పంక్తుల మీఁదసోఁకి ధాతుకాంతులచే నరుణారుణంబై భాసించె. దనక్షేత్రంబునకు వచ్చు వారి నెదుర్కొన శ్రీనివాసస్వామిచే నియోగింపఁ బడిన పరిచారకునింబోలెఁ జల్లనితాఁకులచే సమీరుం డుపచరించె.

నియమితములైన స్థలముల నిలిచి మఱలఁ
బోవుచుండెనుబండి యథావిధమున
నదియె వేంకటగిరి, యల్లయదియె కాళ
హస్తి, యనువాక్యములు విననయ్యె నపుడు.

వ. తిరుమలయాత్రికులకు బసల నేర్పాటు చేయువారి జీతగాండ్రు కొందఱు పెద్దపెద్దపుస్తకములఁ దీసికొని బండి పెట్టెలలోనికి వచ్చి పూర్వము తమ బసలకు వచ్చియున్న యా గ్రామీణుల నామధేయములఁ జదివి చూపించి మీకు సుఖముగా స్వామిదర్శనాదులఁ జేయింతుము మా వెంట రమ్మని నిర్బంధించుచుండిరి. ఇంద్రభోగసుందరంబైన దేవాలయ ధర్మసత్రంబు నెఱుంగనివారు వారి మాటలకు లొంగి తమపూర్వుల పేరులు వచించినంతనే యొక విధమైన మచ్చిక కలిగి వారితోఁ బోవ నీయకొనిరి. నాచేఁ దెలుపఁ బడిన వారు కొందఱు నన్ననుగమించిరి. శకటంబంతలో ననిలవేగంబునఁ బోయి తిరుమలలో నిలిచె.

బండిదిగిమేము బయటికి వచ్చినంత
రమ్ము రమ్మని కొందఱు గ్రమ్ముకొనిరి

బసలకునురాము మేము దేవస్థలంబు
సత్రమెటనుండుఁ జెప్పుడు చాలునన్న.

మంగలియొక్కఁడచ్చటికి మార్గముఁజూపెద రమ్మటంచు నా
చెంగట నొక్కసత్రమునఁ జేరిచెఁ దద్యజమాని యెవ్వఁడో
ముంగిటఁగూరుచుండి మునుముందుగ రూకలు రెండు మాకునీ
యంగవసింపనిత్తుమిటనంచు వచించెను గర్కశంబుగాన్.

వ॥ అంతట నేను బరికించిచూడ నందున్న గదుల కవాటంబులన్నింటికి రంధ్రంబులుండె. నచ్చట మూఁగియున్న వాండ్రెల్లరు మోసగాండ్రుగాఁ బొడసూపిరి. దేవాలయ ధర్మసత్రం బదిగాదనియు నొక వంచకస్థలంబనియు గ్రహించి, యైన నిప్పుడే బయలుదేఱిపోవు మనకునేమిలెమ్ము, మఱల వచ్చునపుడు ధర్మసత్రంబు నరయవచ్చునని, రూప్యంబులు రెండు నిచ్చి లోనఁబ్రవేశించి స్నానంబు లొనర్చి, భుజించితిమంతలో నొకఁడు, వెండి, రాగి రూకలు తెచ్చి "యింకొకరి దగ్గఱఁ గొన్న మోసంబు జరుగుననియు, దాను దేవాలయాధికారులచే న్యాయముగా నమ్ముటకు నియమింపబడిన వాడననియు, స్వామి కవి సమర్పించుట మహా ఫలప్రదంబనియు, నుపన్యసించి విక్రయింప సాగెను. మఱియొక్కఁడు వచ్చి యాత్రికుండైన యన్యునివలె నక్కవినయంబులుదోప వానికినమస్కరించి, యొక్కరూప్యంబు విలువగల రెండు పిడికెళ్ల రూకల నెనిమిది రూపాయలకుఁ గొనిమె "నతివినయం, ధూర్తలక్షణం". పల్లీవాసులైన

యాత్రాపరులు నిజమేగదాయని తీసికొనసాగిరి. నా వెంట నున్నవారు నాచే వారింపఁబడి విరమించుకొనిరి.

వరుణహరిత్తటంబునకు వ్రాలె దివాకరబింబ మెండ తీ
వరముశమించె, సాగెఁ జనుపాంథులతో ననుకూలవాయువుల్,
త్వరపడి మేము పర్వతము పైకరుగన్ సమకట్టి బత్తెముల్
బరువులు మీఁదనెత్తికొని పట్టణ శోభలనెల్లఁ జూచుచున్.

ఉత్తరదిశగా వెడలి వి
యత్తలమున కంటియున్న యహిరాజమహీ
భృత్తిలకముఁ గని కరముల
నెత్తి "నమోనమ" యనుచును హెచ్చినభక్తిన్.

వ. ఆపర్వతరాజంబునకు నమస్కరించి తదారోహణోత్కంఠ వడివడిగా నడచితి మమ్మహీధరంబు మాకనతి దూరంబుననున్నట్లు గానిపించెఁగాని యెంతసేపటికి దానిడాయలేమైతిమి. ధరణీధరంబునంతటఁ బెరిగియున్న సాంద్రతరుషండ మండలంబులు చలియల గోరాడు నీల ధారాధరంబుల కరణినొప్పె. తెల్లగా గనుపట్టు సోపానమార్గంబు శిరస్థలసరదంబుఝరీప్రేక్షణీయంబయ్యె. నట్లు కనులపాపంబు దొలఁగ నిరీక్షించుచుఁ జేరంజని.

అనగముఖ భాగంబున
నేనుఁగు లిరుకెలకులందు నెసఁగెడి రీతిన్
దానవమర్దను వ్రాసిన
మానితగోపురము దాఁటి మలుపుదిరుగగాన్.

అచట సోపానవీథిపై నవల నివల
నాకుటెండ్లఁ గాఁపురముండు నాటవికులు
బాలవృద్ధులు వనితలు బాఱుతెంచి
స్వామి సేవింప నరిగెడి జనులఁ జూచి.

వ. పుణ్యంబుఁ జేసికొనఁ బోవు నోయయ్యలారా! యివె స్వామిపాదంబులు నమస్కరింపు డిదె తీర్థంబు గ్రహింపుడని యడ్డువచ్చి కానికలర్థించుచుఁ దిరస్కరించి పోవువారిఁ గొంతదూరం బనుగమించి బ్రతిమాలుచు నప్పటికి వినకున్న వారిని దిట్టుకొనుచుండిరి. వారి కేమకానులోసంగి యవలికిఁజన నీక మార్గంబు వెంటఁ బాదహీనులును, నేక హస్తులును విగతాక్షులును నంగుళీరహితులును, నంగ వైకల్యంబేమియు లేకయున్నను నొక్కకన్ను మూసికొని గ్రుడ్డివాఁడనయ్యా! యని కేకలిడువారును, జేతిని వెనుకకు మడచి కట్టుకొని యేడ్చువారునునైన భిక్షుకులు పరస్సహస్రంబుగా గానవచ్చిరి. వారి కోపినంత ధర్మంబు సేయుచుఁబోవ దేవాదిదేవు దర్శించి తిరిగి వచ్చువారు దూరంబున మెట్లుమీఁదుగా దిగుచుఁ బిచ్చుకలవలెఁ గన్పట్టిరి. లక్షలాదిగా నున్న యాత్రికుల.

ఏడు కొండలవాఁడ! కాపాడువాఁడ!
నిలువుదోపులవాఁడ! నానోములవాఁడ!
వడ్డికాసులవాఁడ! బ్రోవ వెయటన్న
నులివునకు నగేంద్ర మెదురు పలుకుచుండె.

కొంతదూర మేగి సంతట మితిలేని
రొప్పువుట్టఁ గాళ్ల నొప్పులడరె
దాహమయ్యె మాకు దాపయ్యె నింతలోఁ
దాపహారి ప్రథమ గోపురంబు.

ఆ మంటప మధ్యంబున
మేమొక్కెడ విశ్రమింప మెల్లగ సోకెన్
భూమీధరసాను తరు
స్తోమంబుల మీఁదినుండి సుడిసెడి గాడ్పుల్.

వ॥ స్వేదసిక్తంబులై యలసిన మా శరీరంబుల కమ్మందపవనంబు లతిలోకసౌఖ్యం బొడగూర్చె. నచ్చట నొక్క యువతి యమ్ముచున్న తేటమజ్జిగ దాహంబుద్రావి, మఱల బయలుదేఱి మింటినొరయు వృక్షశాఖాగ్రంబుల వ్రేలాడుచు నాడుచున్న మర్కట కదంబంబుల నరయుచు, దిగువ బొమ్మరాళ్లవలె గన్పట్టు పట్టణ సౌధంబుల నవలోకించుచు, నెడనెడ విశ్రాంతిఁగొనుచు, గోపుర చతుష్టయంబు గడచి చుక్కల పర్వతంబన నొప్పు నమ్మొదటి కొండ దాఁటితి మచ్చటనుండి మార్గం బెక్కుడులేక సమంబుగా నుండె.

సరణి కిరుప్రక్క శీతలచ్ఛాయమైన
కలిత తరుగుల్మ శోభిత కాననంబు
నయన సాఫల్య మొనరించె నాఁటివేళ
స్వాంతమున శాంతి లహరులు జాలువాఱె.

వ॥ పల్లవ పుష్ప సుందరంబులైన చూతబృందముల మీఁద నెక్కి గానంబొనర్చు కోయిలల పంచమరాగంబు లుదంచితంబులై చెట్ల చిగురు జొంపంబులలోఁ బ్రతిధ్వనించి శ్రవణసుఖంబొనర్చె. నచ్చటచ్చట శాఖాదళ మధ్యంబుల నుండి క్రిందికిఁ దొంగిచూచు నరుణ జరఠాతపంబు లభిరామంబులై గానవచ్చె. కుసుమ పరాగంబులు గరుదంచలంబుల నంటుకొన ఝుమ్మని యొక వృక్షంబునుండి మఱియొక వృక్షంబునకుఁ బోవు భ్రమరకులంబులు చైత్రమాసలక్ష్మిఁ బొగడుచున్నట్లు దోఁచె. సాయంసమయంబున నవ్విపినంబులోఁ దైర్థికపద ఘట్టన స్నిగ్ధ శిలా మార్గంబున నేగు మాకు నందనవన విహారంబు చవిచూచినట్లయ్యె.

వేంకటేశ్వరు సేవింప వెళ్లుమమ్ము
నరసి తనకట్టి భాగ్యంబు దొరకదాయె
నన్న సిగ్గునఁ బోలెఁ జండాంశుఁడంత
వేగపడి క్రుంకె నా కొండ వెనుక కరిగి.

వ. భగవత్ప్రాప్తికిఁ బ్రయత్నించువారికి సాంసారికచ్ఛిద్రంబుల వలె మసకచీఁకటులు మమ్మావరించె. భగవానుని యకారణకరుణావలోకనంబుల పోల్కి నింతలో మార్గంబు పొడవున నొక్కసారిగా విద్యుద్దీపంబులు భాసించె. నల్లేము చనిచని యేడవది యైన మోకాళ్లపర్వతంబు దర్శించితిమి. దానిమీఁదఁ ద్రోవవెంటనున్న వైద్యుత దీపకళికల వరుస పైకిఁ బోయిపోయి నక్షత్రంబులఁ గలిసిపోయె. దానిఁజూచి యిప్పుడంత యెత్తునకుఁ జనవలయుఁ గదా

యని భయపడియుఁ దప్పమింజేసి నడచి యమ్మహీధరంబు నెక్క మొదలిడితిమి. కించిద్దూరంబరిగి యెడమ వైపునకుఁ జూడఁ జంద్రగిరిలోని విద్యుద్దీపంబులు గానవచ్చె. నట నుండి మెల్లగా బయలు వెడలి యందందు గూర్చుండుచు లేచి పయనించుచు, రాత్రిఁ బదిగంటల కెగువతిరుపతిఁ జేరితిమి. చిత్రవిచిత్ర వర్ణంబులు కలిగిన యచ్చటి యబింధనవహ్ని దీపంబుల కాంతులకు భూమి శబలీకృతంబై చూపట్టె. నచ్చట దేవాలయాధికారుల యనుజ్ఞ వొంది దేవస్థాన ధర్మ సత్రంబున నొక్క గదిలోఁ బ్రవేశించి కాల్యాంబులుదీర్చి భోజనము లాచరించి పరుంటిమి. సహస్రస్తంభ శోభితంబైన యా సత్రంబున మా వలె వచ్చి వరుసలు వరుసలుగా వేనకువేలు యాత్రాపరులు శయనించిరి. రేయంతయు నియమితోద్యోగులు సత్రద్వారంబున నిలువుగాళ్లనిలిచి కావలిఁ గాయుచునే యుండి రపుడు.

భుజగేంద్ర శయను సంబోధించు బహువాద్య
మంగళారావ తరంగములును
బ్రాభాతికానిలప్రభవంబులై రేఁగు
ధ్వజరాజఘంటికా ధ్వానములును
నధ్యాపక స్వాములాచరించుచు నున్న
స్వస్తివాచన శుభస్వానములును
గోపుర ప్రాకార కుహరంబు లందుండు
కలరవంబుల మంద్రగానములును

కల్యమందానిలములలోఁ గలిసివచ్చి
దివ్యచారిత్రుఁ బద్మావతీ కళత్రుఁ
గనుల పాపంబు లుడివోవఁ గాంచరారె
జాలమేమిటికని మమ్ము మేలుకొల్పె.

వ॥ లేచి మేమాదయిక కృత్యంబులు నిర్వర్తించి స్వామి కల్యాణకట్టలోఁ గేశంబు లర్పించి దేవాలయము నంటి యుత్తర దిశనున్న బంగారు కోనేటికింజన నచ్చట ముండిత శిరస్కులై బ్రహ్మముడులు వైచికొని విప్రులు సంకల్పము వచింప స్నానములొనర్చు తైర్థికు లిసుకఁజల్లిన రాలకుండ నుండిరి. మే మప్పుష్కరిణికి నమస్కరించి, లోనికిదిగి.

ఈహ దొనఁక "గంగే మాం పునీహి" యనుచు
స్నానము లొనర్చి ధౌత వస్త్రములు గట్టి
కొలని సోపానములమీఁద గూరుచుండి
క్రమముఁ దప్పక యూర్ధ్వ పుండ్రములఁదాల్చి.

వ॥ అగరు కర్పూర ఫలంబులెత్తికొని వికస్వర ప్రభాకందళంబుల విభాకరునితోఁ బ్రతిఘటించుచున్న భర్మశిఖరంబులు గలిగి యొప్పారు గోపురం బతిక్రమించి రెండవ ప్రాకారంబునకుఁ బ్రదక్షిణం బొనర్చి, ద్వితీయ గోపురంబు దాఁటి విమానంబంతయు హాటకమయంబగుటచే గనులకు మిఱిమిట్లు గొలుపుచున్న యద్దేవాదిదేవు నాలయంబునకు వల చుట్టి కనకశిఖర ఘంటాచ్ఛద ధగద్ధగితంబైన ధ్వజదండంబుపలక్షించి బలి పీఠంబునొద్ద సాష్టాంగంబు సేసి లేచి చేతులు జోడించి నిమీలిత నేత్రుండనై–

కాననావృతులచేఁ గష్టమార్గములైన
　　　　యేడు కొండలమీఁద మేడనీకు
నాసేతు శీతాచలావధి దేశంబు
　　　　నాసొంపుఁ బంట మాగాణి నీకు
దర్శింపవచ్చెడి ధనికుల సర్వస్వ
　　　　హరణంబె నిత్యకృత్యంబు నీకు
నాపన్నులై "పాహి" యనువారి నెల్లరఁ
　　　　గరుణఁ బ్రోచుట దొడ్డ బిరుదు నీకు

గలియుగంబునకును నోరు గలిగినట్టి
దేవుఁడవు నీవె దీనునిఁ బ్రోవరావె
మిళితమౌక్తికహాస! చాంపేయనాస!
భానుసమభాస! పద్మావతీనివాస!

నీవే బ్రహ్మవు సర్వభూభువనముల్ నిర్మించు కాలంబులో,
నీవే విష్ణుఁడ వాపదల్ గెడపి మన్నింపంగ, రుద్రుండవై
నీవే భస్మమొనర్తు వంత్యదశలో, నిర్వాణకాంక్షుల్ సదా
భావింపందగు తత్త్వమీవెగద దేవా! వేంకటాద్రిప్రభూ.

వాలుగ చేపవై నాలుగు వేదాలు
　　　　దెచ్చి వేలుపుఁ బెద్దకిచ్చినావు
సుందరకూర్మమై సురలోక వనితల
　　　　పసుపుఁగుంకుమ గట్టిపఱచినావు
పరగటిపందివై ప్రబలదానవుఁజంపి
　　　　యిలనొంటికోఱఁ బైకెత్తినావు

మానిసిసింగమై మనుజాశనుని బాధ
నడలుడింభకునిఁ గాపాడినావు

పొట్టివడుగండవై భిక్షఁ బట్టినావు
దుష్టరాజులగాలించి ద్రుంచినావు
మిళితమౌక్తికహాస! చాంపేయనాస!
యరుణశతభాస! వేంకటగిరినివాస!

బ్రహ్మమునులు నిన్నుఁ బరికింపఁగాలేరు
శ్రుతిచయంబువలనఁ జూడఁబడవు
తొలుత నడుమ చివర దోపవునీయెడ
జాడ లేని మాయలాడ — వీవు.

గ్రాహంబునకుఁజిక్కి "పాహిపాహి"యటన్న
గజరాజు దయతోడఁగావలేదె
కౌరవేంద్రుని చేతఁ గాసినొందిన యాజ్ఞ
సేని నాక్షణమె రక్షింపలేదె
పావనచరితులౌ పరమహానులకన్న
మిన్నగాబోయెత నెన్నలేదె
సేతుబంధనవేళఁ జేవెట్టి సవరించి
చిక్రోడమును సంతసింపలేదె

యేల దయరాదుస్వామి! నన్నేలవేమి?
విడువఁదగువాడగాను నీ యడుగులందు
నసువులూడిచి యైన నీ యంతుగందు
దేవనుతగాత్ర! పద్మావతీ కళత్ర!—

వ. మజ్జనకుండవు భవత్పాదారవింద మకరంద మిళిందాయిత మానసుండైన బ్రహ్మవేది; యమ్మహామహునిఁ జూచి యైన నన్ను బ్రోవరాదె. మా కుటుంబమంతయుఁ ద్వత్పవిత్ర చరణయుగైక ధనంబు. నీ చల్లని కృపాకటాక్షంబులకుఁ బాత్రుండగాని నిగ్రహంబునకు యోగ్యుండగాను; చింతాదంతురితంబైన యీ దుష్టరోగ బాధ నింక సైరింపఁజాల. నా మొఱయాలించి యచిరకాలంబున దీనిఁ బరిహరింపవేని.

పలుమాటల్ వచియింప నేమిటికిఁకన్ బద్మాక్షు! నాశీర్షమీ
బలిపీఠంబున వ్రక్కలించుకొని యబ్రహ్మణ్యమున్ బెట్టెదన్
జలజాతాప్త మృగాంకులాన, గ్రహనక్షత్రవ్రజంబాన, భూ
సలిలవ్యోమమరుత్తులాన, యలతేజంబాన, నీ నాయెడన్.

వ. అని జగదీశ్వరుండైన యప్పద్మావతీ నాథునకు విన్నవించుకొని బంగారు మొలాముచే ధగద్ధగయను నాలయ ముఖభాగంబు నిరీక్షించుచు లోనికింజని ఘనసారనీరాజన దీపకళికా కాంతిలో నచట వేంచేసి యున్న.

కాలమేఘ శరీరుఁ గనకకుండలహారు
మణికర్ణపత్రు సమాప్తశత్రుఁ
జాంపేయ శుభనాసుఁ జంద్రికా సుమహాసు
మృగనాభిలిప్తు నిర్నిద్రదీప్తుఁ
బుష్ప మండితవక్షుఁ బుండరీక దళాక్షు
భ్రమరకుంతలపాశు భవవినాశు

నిగమ శాఖాస్తుత్యు నిర్జితాఖిల దైత్యు
సాధు సన్నుతశీలు సామలోలు

వనజ నిలయాకళత్రుఁ బావనచరిత్రు
నైక గుణభావు వేంకట నాథదేవు
సాంద్రహర్షాంబు పూరముల్ జాలువాఱఁ
గాంచి పులకించి వినుతించి కాన్కలుంచి.

వ॥ తీర్థ ప్రసాదంబులు స్వీకరించి వెలికివచ్చి ప్రదక్షిణంబొనర్చి స్వామి హుండీలో శక్తికొలఁది రూకలును ద్రవ్యంబును వైచి, నాఁటి పవలంతయుఁ దత్ప్రాంతీయంబులైన వేంకట నగప్రభుని యుద్యానవనంబుల సొంపుఁ దిలకించి, గోగర్భ స్థలంబు దర్శించి, రాత్రి సత్రంబునఁ బరుండి మఱునాఁడు.

అరుణకిరణుండు పూర్వభూధరశిరంబు
నెక్కకయ మున్న మేల్కని పెక్కుమంది
జనులుపోవుచునుండఁగా సంభ్రమమునఁ
బాపనాశనమునకేగ బయలుదేఱి.

వ. మార్గంబున కిరుప్రక్కలఁ బెరిగి శాఖలు కలిసికొని పథికులకు శ్రమంబు జనింపకుండఁ జల్లనినీడ వెట్టుచున్న నానా తరు సుందరంబైన యయ్యరణ్యశోభ కాశ్చర్యపడుచుఁ గ్రిందికిదిగుచుఁ బైకినెక్కుచు గ్రోశద్వయ దూరంబతిక్రమించి యచ్చట నంబరంబంటియున్న యామ్రవనంబు మధ్యఁ బర్వతముమీఁదనుండి యొకలోయలోఁ బడుచున్న రెండు జలపాతంబులంగంటి మందొకటి పాపధారయనియు

రెండవది పుణ్యధారయనియుఁ బేర్కొనంబడు; నా జలంబు మందాకినీ సలిలంబువలె స్వచ్ఛంబై స్వాదుశీతలంబై తాపహారియయ్యె. నా ధారాద్వితయంబులోన సుఖస్నానం బొనర్చి తిరిగి త్రోవవెంట కానులకై శిరంబువఱకు భూమిలోఁ బూడ్చుకొని పరుండియున్నవారును, భూతినలమి విగ్రహంబులవలెఁ జలింపక నిలచినవారును, జేతులు వెనుకకుఁద్రిప్పి యోగాభ్యాసకులవలె నుపవిష్టులైనవారును, నైన యాటవిక భిక్షువులఁగాంచుచు మధ్యాహ్నంబునకు సత్రమునకువచ్చి భోజనములుసేసి మోటారుబండిలోనెక్కి మహాభయంకరంబులైన కొండలోయలంగనుచు దిగువ తిరుపతికివచ్చి దేవస్థాన సత్రంబునఁ బ్రవేశించితి మది జలయంత్రంబులతోడను విద్యుద్దీపవంతంబులైన మేడలతోడను నయనాభిరామంబై సౌఖ్యావహంబుగానుండె. మేము సాయంకాలంబున నచ్చటి గోవిందరాజస్వామిని దర్శించి కావలిసిన యాత్రావస్తువుల నంగడులలోఁ గొని తెచ్చి భద్రపఱచుకొని బసలో నిద్రించితిమి.

వేగుజాముననే లేచి వెడలి యొక్క
యశ్వశకటంబులో నెక్కి యరిగి కంటి
మలిగి పద్మావతీదేవి నెలవువీడి
కాఁపురం బున్నయట్టి మంగాపురంబు.

వ॥ పోవునప్పు డాగ్నేయ భాగంబున దేవీ నిలయంబు శిఖరంబునకంటనున్న విద్యుద్దీపంబుల వరుసయు, వాయవ్యదిశఁ జుక్కల పర్వతంబున సోపానంబులవెంట మింటి కంటి

వెలుఁగు దివ్వెలబారును నేత్ర పర్వంబుగా గానిపించె. నల్లేముపోయి సువర్ణముఖిలో కాల్యంబులఁ దీర్చుకొని, యాలయంబునకుఁ బశ్చిమంబున నున్న పుష్కరిణిలో స్నానంబులొనర్చి లోకజనని యైన యప్పద్మావతీదేవి దర్శించితిమి. మఱలఁ దిరుపతికివచ్చి నాఁటి మధ్యాహ్నంబున ధూమశకటంబు నెక్కి రెండవనాటి కిలు సేరితిమి. వేంకటగిరినాథు దర్శించిననాఁటి మధ్యాహ్నంబునుండియే నన్ను దీర్ఘకాలంబుగా దహించుచున్న చింతాదవానలంబు చల్లాఱె. మానసంబున శాంతికళిక మఱల మొనసూపె. మహార్ఘంబులైన యౌషధ సహస్రంబుల కణుమాత్రంబైన లొంగని వ్యాధి వెనుకంజవేసె. శరీరం బారోగ్యోన్ముఖంబయ్యె. నిష్ప్రభంబైన నా ముఖంబు యథా పూర్వంబుగాఁ దేజోవంతంబు కాఁజొచ్చె. నహా! దైవమహిమ. ప్రత్యక్షంబు, ప్రత్యక్షంబు, కాక యూరక లక్షలాదిగాఁ బ్రజలాక్షేత్రంబునకు వత్తురే! వచ్చిరిపో ధనైకప్రాణులై లుబ్ధులైన జనులు కోట్లకొలఁదిగా ద్రవ్యం బా స్వామి కర్పింతురే. విచారింపక దైవంబులేఁడని ప్రలపించు వారి విషయంబు శోచనీయంబు. వా రనధిగత శాస్త్రజ్ఞానులు, నపరిచితార్ష ప్రవృత్తులు. విగళిత పవిత్ర భారతీయసంస్కృతులు, పాశ్చాత్య నాగరకతా పంకపరిలిప్తు లట్టివా రొక్కసారి యట్టిచోట్ల కరిగి మూర్తీభవించి తాండవించుచున్న భగవన్మహిమఁ జూచిన బాగుపడుదురేమో! అబ్బా! విపరీతజ్ఞానులైనవారికిఁ గన్నులారఁ జూచినను దెలియదు. విన్నను దెలియదు. “చెచ్చెరబుట్టునే పరులు సెప్పిననైన

నిజేచ్ఛనైన నేమిచ్చిననైనఁ గానలకు నేగిననైన" సత్యంబు సత్యంబు. మూర్ఖస్యనాస్త్యౌషధ మ్మన్నవాఁడు వెఱ్ఱి వాఁడా? యది యట్లుండె, దరంగమాలా కల్లోల కరాళం బైన యాపత్సముద్రంబున దిక్కు దెలియక యల్లాడుచున్న నన్నుద్ధరించి, రక్షించిన, యప్పద్మావతీప్రియుని ఋణంబు నెన్నిజన్మంబులలోనైనఁ దీర్చుకొనఁగలనే యైనఁదత్తోపేక్ష్య వర్గంబులోఁ జేరిన నాకు ఋణంబెక్కడిది, కాక, సమస్త దురితంబు లడఁచి నిష్కారణంబుగా జనులఁ బ్రోచుట, కరుణాతరంగితాంతరంగుండును, ననంతకల్యాణ గుణ పరిపూర్ణుండును నైన, యా వేంకట పరబ్రహ్మంబునకు నైజంబా భగవానుఁడు సేసిన మేలు మఱచి యింద్రియానుయాయులై యథేచ్ఛంబుగా సంచరించుట కృతఘ్నులైన నాబోంట్లకు సహజంబు శాంతి శ్శాంతి శ్శాంతిః.

సమాప్తము

---

# స్వీకృతి

పూడివాడ వసించు సంపూజ్యచరితుఁ
డైన శ్రీ వేంకటార్యు మూడవ సుతుండు
దాశరథిసూరి : తత్కవితనయ మహిత
లలితలావణ్య – కావ్యకళా కుమారి.

నందన మధుమాసాంతము
నందున, నా కామె పెండ్లియాడఁగ నచ్చెన్
ఇందిర పతి మందిర భవ
సుందరతర మహముమేళ సుజనులు మెచ్చన్.

అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన భార్యతోఁ
గాఁపురం బొకరీతిఁ గడపినాఁడఁ
గీర్తి కాంతారతి క్రేళ్లువాఱఁగ వీర
భారత కృతినిఁ జేపట్టినాఁడఁ
దల్లిదండ్రుల కంకితముగాగ విప్లవ
జ్వాల నాటిక మున్నె యేలినాఁడఁ
గోరికి నేఁడిట్లు సూరికావ్యానికి
సంతృప్తిమై చేయి చాచినాఁడ

నన్ను లేమన్ననేమి నా యంతరాత్మ
పూవుతటివిచ్చు మామిడి పూఁతచివురు
వోలె కోమలయౌ కవితాలతాంగి
వైపునకె సాగి పర్వులు వాఱునెపుడు.

౨

తడవ భావంబునందు శైవుఁడను నేను
ఆరితేఱిన వైష్ణవాచార యామె
తరుణ రేఖలుచన్న చౌదరిని నేను
తెళ్ఁగు జవరాలు కాఁపుల బిడ్డ యామె.

కావ్యకన్యామణీ కరగ్రహణ విధిని
గమ్మ కాఁపు కులంబులు కలియనిట్టు
లెసఁగివచ్చెను గాబోలు నీశ్వరేచ్ఛ,
చల్లఁబడు గాక విశ్వంబు శాంతినొంది.

మేకా గన్నయ్యచౌదరి

---

భారతీ ప్రెస్, తెనాలి—1952

